# వివేకానందలహరి

(విశ్వమత మహాసభలో వివేకానందస్వామి ఉపన్యసించిన
సంఘటనకు శతాబ్ద్యుత్సవ సాహితీ నీరాజనం)

**యువభారతి 30 వ వార్షికోత్సవాల
సందర్భంగా ఏర్పాటు చేసిన లహరి
ఉపన్యాస వ్యాస మంజరి - 1994**


## యువభారతి

**సాహితీ సాంస్కృతిక సంస్థ**

**ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు**

**తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.**

# VIVEKANANDALAHARI

Lectures delivered by scholars on the occasion of 30th Annual celebrations of Yuvabharathi held on 6th Feb & 6th March 1994.



యువభారతి 30 వ వార్షికోత్సవ ప్రచురణ

ప్రచురణ సంఖ్య : 148

ప్రథమ ముద్రణ : మార్చి, 1994

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

**వెల : రూ. 25-00**

ప్రతులకు :

**యువభారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001

ముద్రణ :

**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600457

ముఖచిత్ర ముద్రణ :

**విప్లా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్,**
శంకరమఠం దగ్గర, నల్లకుంట,
హైదరాబాదు - 500 044.
ఫోన్ : 666242.

# విషయ సూచిక


1. మూడు పదుల యువభారతి

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం .... 3

2. వివేకానందలహరి - ప్రారంభోపన్యాసము

పూజ్యపాదులు శ్రీ పరమార్థానంద స్వామీజీ .... 10

3. వివేకానంద వాణి

డాక్టర్ సి. నారాయణరెడ్డి .... 14

4. ఆత్మజ్ఞాన గోవిందుడు వివేకానందుడు

డాక్టర్ జె. బాపురెడ్డి .... 15

5. శ్రీ వివేకానందవాణి భారతీయ అంతర్వాణి

శ్రీ పి. వి. రాజేశ్వరరావు .... 17

6. ఆదర్శ సన్యాసి వివేకానందుడు

డాక్టర్ టి. వి. నారాయణ .... 24

7. విశ్వమత మహాసభ

డాక్టర్ ఉందేల మాలకొండారెడ్డి .... 27

8. యుగచైతన్య వైతాళికుడు శ్రీ వివేకానందస్వామి

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం .... 29

9. వివేకానంద జీవితం - సందేశం

రాష్ట్రకవి - డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రి .... 33

10. ఆధునిక జీవితము - అనుష్ఠాన వేదాంతము

శ్రీ వాకాటి పాండురంగారావు .... 68

11. సమాజంలో స్త్రీ : వివేకానందుని దృక్పథం

కుమారి డాక్టర్ కమలాజయరావు .... 77

12. వివేకానందుడు : యువత

డాక్టర్ ప్రొద్దుటూరి ఎల్లారెడ్డి .... 95

# మూడు పదుల యువభారతి

## మూడు ఆశయాలు :

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించ గల సహృదయ లోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలంవారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణలద్వారా, కార్యక్రమాల ద్వారా యువ భారతి యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది!

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్నీ, ప్రజా స్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి!

## సాహితీసంస్థగా ముందడుగు :

రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంతో యువభారతి ముప్పైయేళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. సమాజంలో ఉత్తమ సాహిత్యం పుట్టటం ఒక వంతు; దానిని ప్రజల మధ్యకు తీసుకొనిపోయే ప్రయత్నం మరొక వంతు. పొలం దున్నే రైతులు, రాట్నం తిప్పే పల్లెటూరి పడతులు, మధ్యతరగతి ప్రజలు, యువతీ యువకులు, విద్యార్థినీ విద్యార్థులు, ఫ్యాక్టరీ కూలీలు, ఉద్యోగులు, ఉద్యోగినులు - ఇలా చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన -

అంటే వారి మాతృభాషలో వెలుపడిన - సాహిత్యం చదవాలి. లేదా, కనీసం ఆ సాహిత్యం గురించి పరిచయం చేసుకోవాలి. అప్పుడే తెలుగుసాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒక జాతిలో రచయిత(త్రు)లు పుట్టటం ఎంత గొప్పో, సహృదయులు అధికశాతంలో అభివృద్ధి చెందటం కూడా అంతే గొప్ప. సాహిత్యంలోని ఉత్తమ విలువలను గుర్తించి, గౌరవించే సహృదయ లోకాన్నీ సాహితీ వాతావరణాన్నీ సమాజంలో నిర్మించటంలో సాహితీ సాంస్కృతిక సంస్థల పాత్ర విశేషంగా ఉంది. ఆ బాధ్యతను గుర్తించి యువభారతి ఇన్నాళ్ళుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. ప్రజల హృదయాలలో తన ముద్రను పదిలంగా వేసుకున్నది.

## యువభారతి జీవితం ఒక సాహిత్యోద్యమం :

యువభారతి 1963 సం॥ విజయదశమినాడు పుట్టింది. మొదటి రెండేళ్లూ రూపుదిద్దుకున్నది. ప్రతి నెలా మొదటి, మూడవ ఆదివారాలలో సమావేశమై యువభారతీయులు మూడుగంటలసేపు మానవ సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడే కార్యక్రమాలను నిర్వహించుకునేవారు. వక్తృత్వాన్నీ, రచనా పాటవాన్నీ, ఆలోచనాశక్తినీ, అధ్యయన శీలాన్నీ, ఝుడితిస్ఫూర్తినీ అలవరచే క్లుప్త గోష్ఠి, పుస్తకచర్చ, కవితాపఠనం, సమాలోచనం మొదలైన అంశాలను చైతన్యవంతంగా నిర్వహించుకునేవారు. అప్పటి సమావేశాలన్నీ సాహితీ శిక్షణ శిబిరాలుగా ఉండేవి. 1965 విజయదశమి నాటికి యువభారతి ఒక సమగ్ర రూపం తాల్చింది.

1965-70 సంవత్సరాల మధ్య యువభారతి తన ఆశయాలకు అనుగుణంగా సాహిత్య కార్యక్రమాలను చేపట్టి ప్రజల మధ్యకు నడిచింది. బలమైన ప్రయోగాలను చిత్తశుద్ధితో చేసి ప్రజల మన్ననలను పొందటం ప్రారంభించింది. మహిళా విభాగ కార్యక్రమాల ప్రారంభం, సైక్లో స్టైల్డు పత్రిక వెలువరించటం (దాదాపు వెయ్యి ప్రతులు చెల్లేవి) ముఖ్యమైన అంశాలు. యువభారతి ప్రచురణలు, సదస్సులు ఒక ప్రత్యేకతతో తెలుగువారిని ఆకర్షించటం ఆరంభించాయి. అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం', కాళోజీగారి 'జీవనగీత', యువభారతీయుల కవితా సంకలనం 'వీచికలు' తక్కువ ధరకు ప్రచురణ పూర్వ విరాళ పద్ధతిలో వెలువరించిన తొలి ప్రచురణలు. 1970 లో 'మారుతున్న

విలువలు: రచయితల బాధ్యతలు' అనే అంశం మీద నిర్వహించిన గోష్ఠి, దానిని 'రచన'గా ప్రచురించిన అనుభవం యువభారతికి కీర్తిప్రతిష్ఠలతోపాటు ఒక ప్రామాణికమైన సాహిత్య సంస్థకు వచ్చే గుర్తింపును గూడా తెచ్చిపెట్టాయి.

1971 - 1985 మధ్య యువభారతి సమాజంలో ఒక అపూర్వ సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. యువభారతి వార్షికోత్సవాల 'లహరి ఉపన్యాస పరంపరలు' ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిచ్చిన 'కావ్యలహరి' తో మొదలయ్యాయి. 1971 లో వేలమంది సాహితీ సభలకు రావటం, సాహిత్యపు విలువలపట్ల సదవగాహన సమాజంలో ఏర్పడటం యువభారతి సాహిత్యోద్యమం కలిగించిన విలువైన చైతన్యం. కావ్యలహరి, కవితాలహరి, చైతన్యలహరి, వికాసలహరి, రామాయణలహరి, నవోదయలహరి, నవ్యసాహితీలహరి, ప్రతిభాలహరి, ఆలోచనాలహరి, సంస్కృత సాహిత్యలహరి, జగద్గురు సాహితీలహరి మొదలైన 'లహరి' ప్రచురణలు సాహితీలోకంలో మన్ననల నందుకున్నాయి.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాలను పురస్కరించుకొని యువభారతి ప్రచురించిన నూరు వ్యాసాల 'మహతి' తెలుగు సాహితీ పరులలో ఒక విలువైన గౌరవాన్ని పొందింది; పరిశోధకుల మన్ననల నందుకున్నది. తెలుగు నవలలను గురించి ఇంగ్లీషులో చెప్పటానికి ప్రయత్నించిన **Telugu Novel** మంచి ప్రయోగంగా ఆదరణ పొందింది. తెలుగులో కవుల కవితా వైభవాలను ప్రచురించే యువభారతి రచనలు ప్రాచీనాధునికాంధ్ర కవులను, భారతీయ భాషా కవులను సరళంగా వ్యాఖ్యానించి చెప్పాయి; చెపుతున్నాయి. యువభారతి ప్రచురించే ప్రతి ప్రచురణా ఆయా సమయాల్లో సమాజంలో కలిగించవలసిన సాహితీ స్పృహను దృష్టిలో ఉంచుకొని రూపొందించేదే. కాలగతిలో అవిచ్ఛిన్నంగా సాగవలసిన సాహితీ రసికత్వాన్ని లహరిగా ప్రవహించేటట్లు కార్యక్రమాలను సాగించటం యువభారతి ప్రవృత్తి!

1991 - 1992 లో యువభారతి రజతోత్సవాలను జరుపుకున్నది. పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 'తెలుగు కవిత : లయాత్మకత' అనే అంశం మీద రజతోత్సవ ఉపన్యాస లహరిని అందించారు. అది గ్రంథరూపంగా వెలువడింది. నెలనెలా మొదటి ఆదివారం సాయంకాలం 5-30 గం॥లకు జరిగే "సమాలోచనం" సమావేశాలన్నీ రజతోత్సవాలలో భాగాలుగా మలచబడ్డాయి. 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం' (1980 - 1990), 'పాతికేళ్ళ పత్రికా

రచన' (1965-1990), యువభారతి రజతోత్సవ సంచిక 'వెండి వెలుగులు', 'అనుభూతి', 'అమృత రాజీవం' కవితా సంపుటాలు రజతోత్సవ ప్రచురణలుగా వచ్చాయి. రజతోత్సవాలలో భాగంగా జరిగిన సరస్సులలోని ఉపన్యాసవ్యాసాల సంకలనాలను 30 వ వార్షికోత్సవాల ప్రచురణలుగా వెలువరించటం జరుగు తున్నది. ఆలోచనలకు అక్షరాకృతి నివ్వటం యువభారతి సాహితీవ్రతం.

యువభారతి 30 వ వార్షికోత్సవాలకు 'వివేకానందలహరి' నిరూపొందించు కొన్నది. శ్రీ స్వామి వివేకానంద చికాగో నగరంలో ప్రపంచ మహాసభలో ఉపన్యసించిన చారిత్రాత్మక సన్నివేశానికీ, స్వామి హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలను సందర్శించిన మరుపలేని ఘట్టానికీ శతజయంతి జరుగుతున్న సందర్భాన్ని పురస్కరించుకొని 'వివేకానంద లహరి' ఉపన్యాసాలను ఏర్పాటు చేయాలనీ, ఆ ఉపన్యాసాలను 'వివేకానందలహరి' అనే పేర వెలువరించాలనీ యువభారతి సంకల్పించింది. ఆ సంకల్పాన్ని అక్షరరూపంగా మలచటంలో యువభారతిని ప్రోత్సహించి, ఆశీర్వదించిన పెద్దలకందరికీ యువభారతి కృతజ్ఞతాభివందనా లర్పిస్తున్నది.

వివేకానంద లహరిని దయతో ప్రారంభించి ఆశీస్సుల నందించిన పూజ్య పాదులు శ్రీపరమార్థానంద స్వామీజీగారికీ, ముఖ్య అతిథులుగా, సభాధ్యక్షులుగా పాల్గొని శుభాకాంక్షలందించిన ఆచార్య సి. నారాయణరెడ్డి, శ్రీ పి.వి. రాజేశ్వర రావు, డాక్టర్ జె. బాపురెడ్డి, శ్రీ కె. వి. రమణాచారి, శ్రీ కోదాటి నారాయణరావు, డాక్టర్ టి.వి. నారాయణగారలకు, వక్తలుగా పాల్గొన్న డా॥ ఓగేటి అచ్యుతరామ శాస్త్రిగారికి, శ్రీ వాకాటి పాండురంగారావు గారికి; కుమారి డాక్టర్ కమలా జయ రావు గారికి, డాక్టర్ పోద్దుటూరి ఎల్లారెడ్డిగారికి కృతజ్ఞతాభివందనాలు. యువ భారతిని ప్రోత్సహిస్తున్న 'సాహితీ మిత్రు'లకు, 'భారతీ మిత్రు'లకు, 'భారతీ భూషణు'లకు, ప్రకటనదారులకు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు, విప్లాప్రింటర్స్‌కు మా ధన్యవాదాలు:

వార్షికోత్సవ సభలను స్పాన్సర్స్ చేసి, ప్రకటనల నిచ్చి యువభారతికి చేయూతనిచ్చిన చిన్న మొత్తాల పొదుపు కమీషనరుగారికి మా ప్రత్యేక ధన్యవాదాలు!

యువభారతి నభిమానించే సాహితీలోకానికి మా అభివందన చందనాలు!

హైదరాబాదు, జి. వి. సుబ్రహ్మణ్యం
6-3 1994. అధ్యక్షుడు.

# యువభారతి 30 వ వార్షికోత్సవాలు

# వివేకానందలహరి

(ఉపన్యాస మంజరి)

## మొదటి సమావేశం

సమయం : 6-2-1994 ఆదివారం సాయంకాలం 5-30 గం॥ లకు

వేదిక : నగర కేంద్ర గ్రంథాలయం, అశోక్‌నగర్, హైదరాబాదు.

అధ్యక్షులు : **డాక్టర్ జె. బాపురెడ్డిగారు IAS**
(కమీనర్, చిన్న మొత్తాల పొదుపు సంస్థ, ఆం. ప్ర ప్రభుత్వం.)

ముఖ్య అతిథి : జ్ఞానపీఠ పురస్కార గ్రహీత
పద్మభూషణ్ **డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు**
(భాషా సాంస్కృతిక వ్యవహారాల సలహాదారు, ఆం. ప్ర. ప్రభుత్వం.)
డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ రచించిన
"తెలుగు, తమిళ కవిత్వాలు : జాతీయవాదం" గ్రంథాన్ని ఆవిష్కరించి ఉపన్యసిస్తారు.

ప్రారంభకులు : పూజ్యపాదులు **శ్రీ పరమార్థానంద స్వామీజీగారు**
(శ్రీ రామకృష్ణ మఠం, హైదరాబాదు)
"వివేకానందలహరి" ఉపన్యాస పరంపరను ప్రారంభిస్తూ తమ సందేశాన్ని అందిస్తారు.

ఉపన్యాసకులు : రాష్ట్రకవి, ప్రసిద్ధ సంస్కృతరూపక ప్రయోక్త
**డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు**
'వివేకానంద జీవితం : సందేశం' అనే అంశం మీద ఉపన్యసిస్తారు.
మహావక్త, ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక డిప్యూటీ ఎడిటర్,
**శ్రీ వాకాటి పాండురంగారావుగారు**
'ఆధునిక జీవితం : అనుష్ఠాన వేదాంతం' అనే అంశం మీద ఉపన్యసిస్తారు.

# వివేకానందలహరి

(ఉపన్యాసమంజరి)

## రెండవ సమావేశం

సమయం : 6-3-1994 ఆదివారం సాయంకాలం 5-30 గంllలకు

వేదిక : నగరకేంద్ర గ్రంథాలయం, అశోక్‌నగర్, హైదరాబాదు.

అధ్యక్షులు : **శ్రీ కె.వి. రమణగారు** I A S
(కలెక్టర్, కడపజిల్లా.)

ముఖ్యఅతిథి : **శ్రీ పి.వి. రాజేశ్వరరావుగారు**
(ప్రధాన కార్యదర్శి, ఆం.ప్ర. కాంగ్రెస్ కమిటీ)
'వివేకానందలహరి'ని ఆవిష్కరించి తమ సందేశాన్ని అందిస్తారు.

విశిష్ట అతిథులు : **శ్రీ కోదాటి నారాయణరావుగారు**
చైర్మన్, ఆం. ప్ర. గ్రంథాలయాలు
**డాక్టర్ టి.వి. నారాయణగారు**
(సభ్యులు, పారిశ్రామిక ప్రదర్శన సంఘం)
**డాక్టర్ జె. బాపురెడ్డిగారు** IAS
(కమీషనర్, చిన్న మొత్తాల పొదుపు సంస్థ)
యువభారతి ప్రచురణలను ఆవిష్కరించి తమ సందేశాలను అందిస్తారు.

ఉపన్యాసకులు : జాతీయ పోషకాహార సంస్థ మాజీ డిప్యూటీ డైరెక్టర్
**కుమారి డాక్టర్ కమలా జయరావుగారు**
'సమాజంలో స్త్రీ: వివేకానందుని దృక్పథం' అనే అంశంమీద ఉపన్యసిస్తారు.
మహబూబ్‌నగర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల ఆంధ్రోపన్యాసకులు, యువకార్యకర్తలు
**డాక్టర్ ప్రొద్దుటూరి ఎల్లారెడ్డిగారు**
"వివేకానందుడు : యువత" అనే అంశంమీద ఉపన్యసిస్తారు.

# వివేకానందలహరితోపాటు 30 వ వార్షికోత్సవాలలో వెలువడుతున్న యువభారతి ప్రచురణలు

**1. కొత్త గొంతుకలు : సరికొత్త విలువలు.**

యువభారతి రజతోత్సవ సదస్సులోని ఉపన్యాస వ్యాసమంజరి. సమకాలీన సాహిత్యంలో వస్తున్న అత్యంతాధునిక రీతులు, వాటిని ప్రపంచిస్తున్న రచయితల కలాల, గళాల బలాబలాలను గురించిన ఒక అంచనా.

**2. విద్యావైద్యశాస్త్ర కళారంగాలు : మానవతా విలువలు.**

సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలనే మానవ మౌలిక మూల్యాలు విద్యావైద్యశాస్త్ర రంగాలలో ఎలా ప్రతిఫలిస్తున్నాయో సమీక్షించే సహృదయ సమాలోచనం. యువభారతి రజతోత్సవ సదస్సు పత్రాల సంపుటీకరణం.

**3. స్త్రీ వాద ధోరణులు : సమకాలీన సాహిత్యం.**

ఆధునిక సమాజంలో, సాహిత్యంలో స్త్రీ అస్తిత్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ అంచనావేసే వ్యాస సంపుటి. యువభారతి రజతోత్సవ సదస్సుకు అక్షరాకృతి.

**4. సాహితీ సమాలోచనం 1992 & 1993.**

ప్రతియేటా వెలువడుతున్న సాహిత్యప్రక్రియలమీద యువభారతి నిర్వహించే 'సమాలోచనం'లో భాగంగా వెలువడుతున్న వ్యాసమంజరి. నడుస్తున్న సాహిత్య చరిత్రను సమీక్షించే వాఙ్మయ నేత్రం.

**5. ఆధునిక సాహిత్యం : దళితస్పృహ.**

యువభారతి ప్రతినెలా నిర్వహించే 'సమాలోచనం'లో భాగంగా సాగిన గోష్ఠిని అక్షరబద్ధం చేస్తున్న ప్రచురణ. ఆధునిక సాహిత్యంలో అత్యంతాధునిక స్పృహతో వెలువడుతున్న దళిత సాహిత్యానికి అందించే ఒక చిరుకానుక.

**6. తెలుగు, తమిళ కవితలు : జాతీయవాదం.**

తెలుగు, తమిళ సాహిత్యాల తులనాత్మక అధ్యయనంలో ప్రసిద్ధిచెందిన ప్రముఖ కవులు, విమర్శకులు డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మగారి పరిశోధనాత్మక రచన.

# వివేకానందలహరి

## ప్రారంభోపన్యాసం

**—శ్రీ పరమార్థానంద స్వామీజీ**

వివేకానందుల వారికి నమస్కారము. పరమ యోగీశ్వరులైన శ్రీ వివేకానందుల వారు భారతావనికి ఆధ్యాత్మిక జ్ఞాన ప్రదాతలు. వారిని గురించి యువభారతి వారు 'ఉపన్యాసలహరి'ని ఏర్పాటు చేయడం ముదావహం. ఈ సభ విద్వత్సభ. ఇలాంటి పెద్ద పెద్ద ఆచార్యులు, కవివరేణ్యులు అలంకరించిన వేదికపైనుండి కన్నడ భాషస్థుడనైన నేను తెలుగులో మాట్లాడడం సాహసమే కాక అధిక ప్రసంగం కూడా అవుతుంది.

ఈ కార్యక్రమాన్ని ఏర్పాటుచేసిన యువభారతి అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు వినయమూర్తులు. వారు గొప్ప విద్యావంతులు కావడం వల్ల వినయవంతులు కూడా అయ్యారు. 'విద్యా దదాతి వినయం' అన్నారు కదా! వారిలో ఒక ఆత్మీయుడు కనిపిస్తాడు, ఒక విద్వాంసుడు కనిపిస్తాడు, ఒక వినయమూర్తి కనిపిస్తాడు, ఒక ప్రేమమూర్తి కనిపిస్తాడు. వారు మా మఠానికి వచ్చి అనేక సభల్లో పాల్గొంటూ, ప్రసంగిస్తూ ఉండడంవల్ల వారికి, మాకు ఆత్మీయత అధికమైంది. సుబ్రహ్మణ్యంగారు ఎదుటి వారిని తొందరగా వశపరచుకొంటారు. రామకృష్ణ పరమహంసగారు ప్రణామాస్త్రాన్ని ప్రయోగించి, అందరినీ వశపరచుకొనేవారు. అలాంటి వారే సుబ్రహ్మణ్యంగారు.

ఈ సభకు ముఖ్యఅతిథిగా వచ్చిన మహాకవి డా. సి. నారాయణరెడ్డిగారు ప్రసంగిస్తూ 'పరమాణుం పర్వతీ కృత్య' అన్నట్లుగా నన్ను పెద్దను చేశారు. 'పరమార్థానందగారు చివరి పురుషార్థానికి ప్రతినిధి. వారు కార్యకర్తగా ఉంటూ అనేక ముఖ్యవ్యక్తుల్ని నడిపించారు. వివేకానందుని చేతన ఒక సంవత్సరం పాటు నడిపినవారు పరమార్థానందగారు' అన్నారు నారాయణరెడ్డిగారు - ఇదే పరమాణువును పర్వతంగా చేయడం! వారు మా సిటిజన్స్ కమిటీకి అధ్యక్షులుగా ఉన్నారు. వివేకానందుని గురించి ఏర్పాటు చేసిన ఆ కార్యక్రమంలో నారాయణ రెడ్డిగారు ప్రారంభగేయం వ్రాశారు. నారాయణరెడ్డిగారు ఆ పాటలో పేర్కొన్న విధంగా వివేకానంద వాణి విశ్వజనీనం.

ఈ రోజు ఉదయం మా రామకృష్ణ మఠంలో వివేకానందుని పై ఒక చక్కని కార్యక్రమం ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన జరిగింది. ఆ విద్వద్గోష్ఠి కవితా నీరాజనాలు నా కళ్ళు చెమ్మగిల్లేట్లు చేశాయి. వివేకానందుని గురించి ఒక్కొక్క మాట వింటూంటే ఒడలు పులకించింది. తన్మయత్వం కలిగింది. ప్రతివారు వివేకానందుని పొగాడడంటూ ఆయన భావలహరిని ప్రస రింప చేస్తూ ఉండడం వల్ల ఆయన ఎంత గొప్పవాడో తెలుస్తుంది. భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు వివేకానందుడు ప్రతినిధి. ఆర్ష సంప్రదాయం మూర్తీభవించిన మహా మేధావి. భారత దేశపు ఆత్మను దర్శించాలంటే వివేకా నందుని అధ్యయనం చేయాల్సి ఉంటుంది. రవీంద్రనాథ ఠాగూర్ రోమారోలాతో ఇదే మాటను ఇలా అన్నారు "If you want to know India study Vivekananda." బ్రిటిష్ వాళ్ళ పాలనలో నిర్వీర్యమై, నిస్తేజంగా ఉన్న భారత జాతిలో చైతన్యాన్ని కలిగించి, దేశంపట్ల ప్రేమను పెంచినవాడు వివేకానందుడు. జాతిపిత అయిన గాంధీగారు కూడా "నాకు దేశంపట్ల ప్రేమను ప్రసాదించింది వివేకానందుడు" అన్నారు.

గొప్ప సాహిత్య సంస్థ అయిన యువభారతి తన 30 వ వార్షికోత్సవాలలో 'వివేకానందలహరి' ఏర్పాటు చేయడం వల్ల ఆయన స్ఫూర్తి ఎలాంటిదో తెలు స్తూంది. వివేకానందుడు గొప్ప ఆధ్యాత్మిక వాది మాత్రమే కాదు - గొప్ప కవి కూడ. అందువల్లనే సామాన్య జనానికి, భగవద్భక్తులకు మాత్రమే కాక కవి పండితులకు కూడా స్ఫూర్తిని కలిగించాడు. ఏతత్ఫలితమే ఈ సభ.

వివేకానందుడు సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని బోధించాడు. విదేశాలకు వెళ్ళి ఆంగ్లంలో ప్రసంగించినపుడు కూడా 'లేడీస్ అండ్ జంటిల్‌మెన్' అనే వారి సంప్రదాయాన్ని గాక భారతీయ సంప్రదాయమైన 'సోదర సోదరీమణులారా!' అనే సంబోధనతో పాశ్చాత్యులను పులకిత గాత్రులను చేశారు. శ్రీ వివేకానంద స్వాములవారు కేవల ఉపన్యాసకులే కాదు. సర్వజ్ఞమూర్తులు, నవయుగ ప్రవక్త. అవతారమూర్తి అయిన శ్రీ రామకృష్ణ పరమహంసవారిచే సుశిక్షితులై, నిర్వికల్ప సమాధిలో అపరోక్షానుభూతి పొందినవారు. జ్ఞాన యోగ రహస్యాలన్నీ వివేకా నందులవారికి కరతలామలకాలే. శ్రీ వివేకానందస్వాములవారు తమకు సంపూర్ణ పరిచితాలైన, ప్రత్యక్ష అనుభూతాలైన విషయాలను అధికారపూర్వక వాక్కు లతో వివరించేవారు. పాశ్చాత్య దేశీయులు హైందవ తత్త్వ విచార మార్గాలలో సుశిక్షితులుగారు. అశిక్షితులు. వారిముందు ప్రసంగించిన శ్రీ స్వామివారు నిగూఢ విషయాలను ఎంతో సుబోధరూపంలో, ఆధునిక భౌతిక శాస్త్రానుసార వ్యాఖ్యారూపంలో వివరించేవారు. శ్రీ వివేకానందులవారు పాశ్చాత్య దేశంలో

ప్రసంగించి వచ్చిన తర్వాత అచట వేదాంతం అపార వ్యాప్తిగాంచి, సుస్థిరంగా పాదుకొనేది.

శ్రీ వివేకానందులవారు అందరికీ అద్వైత జ్ఞానం కలగాలని కోరుకొనే వారు ''సర్వజనులకు - సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువు లకు, పండితులకు, పామరులకు - అందరికీ అద్వైతజ్ఞానం సమానాధికారం గల సొమ్ము కావాలి'' అని తమ ప్రసంగంగాలలో చెప్పేవారు. లండన్, న్యూయార్క్, అమెరికాలలో 1896 లోను, కాలిఫోర్నియాలో 1900 సంవ త్సరంలోను శ్రీ స్వామివారు చాలా గొప్ప ప్రసంగాలు చేశారు.

శ్రీ వివేకానందులవారు గీతాచార్యులైన శ్రీకృష్ణునిలాగా, అహింసా బోధకులైన బుద్ధునిలాగా, అద్వైత ప్రవక్త అయిన ఆదిశంకరులవారిలాగా భారతీయ విచారధార తెలిసిన గొప్ప బోధకునిలా కనిపిస్తారు వారి ప్రసంగంలో వేదాల నుండి, ఉపనిషత్తుల నుండి కొటేషన్లను ఇస్తూ వుండేవారు. వాటిని అతిసులభమైన భాషలో విశ్లేషించి వివరిస్తూ ఉండేవారు. వారి ఉపన్యాసం విన్న దేశీయులైనా, విదేశీయులైనా స్ఫూర్తిపొందక ఉండేవారు కారు. మన భారతదేశపు మొదటి ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారు గొప్ప మేధావి. ఆయన Discovery of India అనే గొప్ప గ్రంథం వ్రాశారని మీ అందరికీ తెలుసు. దానిలో వివేకానంద స్వాముల వారి గురించి రెండు వాక్యాలే రాశారు. రంగనాథా నందగారు వారిని కలిసినపుడు 'మీ discovery of India' లో వివేకానందుల వారి గురించి రెండు వాక్యాలే రాశారేంటి? అని ప్రశ్నిస్తే, శ్రీనెహ్రూ గారు 'నేను జైలులో ఉన్నప్పుడు శ్రీ వివేకానంద స్వామి వారిని గురించి బాగా చదివి రెండవ ఎడిషన్‌లో ప్రత్యేకంగా ఒక చాప్టరే (chapter) శ్రీ వివేకానందులవారిని గురించి వ్రాశాను' అని చెప్పారు. సామాన్య మానవుని మొదలుకొని నెహ్రూ, గాంధీగారల లాంటి గొప్పవాళ్ళకు కూడ స్ఫూర్తి నిచ్చింది వివేకానందవాణి. అందుకే అది విశ్వజనీన వాణి.

ఏ దేశానికైనా, ఏజాతికైనా ఒక సంస్కృతి ఉంటుంది. కాని భారతదేశ సంస్కృతి ఇతర దేశాల సంస్కృతుల కంటే భిన్నమైనది, గొప్పదైనది. వివేకానందులవారు మన భారతీయ సంస్కృతిని నిలబెట్టడానికి ఉద్భవించిన అవతార పురుషులు. వివేకానందుని తర్వాత భారతీయ సంస్కృతిని నిలబెట్టగల నాయకుడు ఇంతవరకూ ఉద్భవించలేదు. అలాంటి నాయకత్వం మనకెంతో అవసరం. యువతరానికి వారి బోధనలను అందిస్తే - వారిలో నుండే ఒక వివేకా నందుడు ఆవిర్భవించ వచ్చు. వివేకానందుని వాగ్ఝరి, భావలహరి నిత్యనూతన మైనవి. వాటిని నిరంతరం ప్రవహింపజేయాలి. వ్యాపింపజేయాలి. కేవలం మత సంస్థలే కాకుండా, సామాజిక సంస్థలు, ఇలాంటి (యువభారతి లాంటి) సాహిత్య

సంస్థలు ఈ పని చేయాల్సిన అవసరం ఉంది. వివేకానందుని విచార ధారను ప్రచారం చేయడానికి యువభారతి తమ వార్షికోత్సవాలలో ఈ కార్యక్రమాన్ని చేపట్టినందుకు వారిని, ముఖ్యంగా సుబ్రహ్మణ్యంగారిని అభినందిస్తున్నాను.

నేడు విదేశాలలో లాగా మన దేశంలో కూడా యాంత్రిక జీవనం స్థిర పడుతూంది. నేడు ఆధ్యాత్మిక భావాలకు ప్రాధాన్యం ఇవ్వడం లేదు. అందుకే అందరూ రకరకాల సంఘర్షణలను అనుభవిస్తున్నారు. అన్ని రంగాల్లోనూ, అందరు మేధావులూ నేడు సంఘర్షణను అనుభవిస్తున్నారంటే, వివేకానందుల వారి భావలహరిని సరిగా అర్థం చేసుకొని ఆచరించక పోవడం వల్లనే. ఒక చోట విద్యార్థులు ఒక కార్యక్రమం ఏర్పాటు చేశారు. నేను కూడా ఆ కార్యక్రమానికి వెళ్ళాను. ఈ సన్యాసులేం మాట్లాడుతారులే అని విద్యార్థులంతా నిర్లిప్తంగా ఉన్నారు. అప్పుడు నేను వివేకానందుల వారి విచారధార గురించి ప్రసంగించాను. వారు శ్రద్ధగా విని ఆశ్చర్యపోయారు. వారికి వివేకానందుల వారి స్ఫూర్తికలిగింది. అప్పుడు వారు వివేకానందుల వారు రాసినవి, ఇతరులు ఆయన గురించి రాసినవి అనేక పుస్తకాలు కొన్నారు. మా రామకృష్ణమఠం కూడా వివేకానందుల వారి భావధారను దేశమంతటా ప్రచారం చేయడానికి కృషి చేస్తూంది. వారి బోధనలను ఆచరణలో పెట్టడానికి శిక్షణను ఇస్తూ ఉన్నాం. అనేక గ్రంథాలను ప్రచురించి సామాజికులకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని కలిగించడానికి ప్రయత్నిస్తున్నాం. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి కళాశాలకు రామకృష్ణమఠం తరపున వివేకానందుల వారి పుస్తకాలను బహూకరించదలచాం.

శ్రీ వివేకానందులవారి భావలహరిని మనం ప్రచారం చేస్తే మన జన్మలు కొంతైనా సార్థకమౌతాయి. ఇది ఒక యజ్ఞం లాగా భావించి ప్రతి ఒక్కరూ ఈ ప్రచారానికి పూనుకోవలసిన అవసరం వుంది. యువభారతి లాగా తక్కిన సంస్థలు, వ్యక్తులు కూడా ఈ ప్రచారంలో పాలుపంచుకోవాలి. వక్తల ఉపన్యాసాలు శ్రోతలను బాగా ప్రభావితం చేస్తాయి. ఆ ఉపన్యాసాలు వివేకానందులవారి భావధారను ప్రచారం చేయడానికి ఉపయోగించడమే గాక శ్రోతలకు స్ఫూర్తి నిచ్చేవిధంగా వాటిని రూపొందించుకోవాలి. ఇక్కడికి వచ్చిన ఉపన్యాసకులు బాగా సిద్ధమై వచ్చారు. వారి ఉపన్యాసాలను మీరు శ్రద్ధగా వినండి. వక్తల ఉపన్యాసాలు విని గాలికి వదలివేయకుండా మీరంతా ఆచరణలో పెట్టాలని, యువభారతివారు తలపెట్టిన 'వివేకానందలహరి' కార్యక్రమం విజయవంతం కావాలని భగవంతుని ప్రార్థిస్తూ సెలవు తీసికొంటున్నాను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# వివేకానంద వాణి

డా॥ సి. నారాయణరెడ్డి

వివేకానంద వాణి విశ్వజనీనం। అది
వేదాంత హృదయ నిలయం నిత్య నవీనం॥

మానవ దేహంలోనే పరమాత్మ కొలువుందనీ
మత సమైక్యతలోనే మానవత నెలకొందనీ
ఆ వాణి చాటింది।
ఆత్మ తంత్రులను మీటింది॥

ప్రతిఫలాపేక్ష వుంటే అది భక్తి కాబోదనీ
పతితసేవను మించిన పరమార్థ మింకేదనీ
ఆ వాణి తెలిపింది।
ఆలోచనలను మలచింది॥

బిగుసుకున్న మనసుంటే ఏ ప్రగతి కనరాదనీ
బుద్ధి విరిసిననాడే ఫలసిద్ధి వుంటుందనీ
ఆ వాణి పలికింది!
అవనినే మేలుకొలిపింది॥

# ఆత్మజ్ఞాన గోవిందుడు వివేకానందుడు

—డా॥ జె. బాపురెడ్డి

కళ్లు మూసుకున్నా కనిపిస్తున్నాడు
చెవులు మూసుకున్నా వినిపిస్తున్నాడు
వివేకానందుడు -
ఒక శతాబ్దం క్రితం
షికాగో మహానగరంలో
భిన్న భిన్న మతాల అభిమతాల
జీవిత పథాల
విశ్వ సమ్మేళన ధర్మ విచికిత్సా క్షేత్రంలో
అద్వైత గీతారథ సారథిగా
ఆత్మజ్ఞాన సమతా ధర్మవారధిగా
ఆవిష్కృతుడైన వివేకానందుడు
కళ్ళు మూసుకున్నా కనిపిస్తున్నాడు
చెవులు మూసుకున్నా వినిపిస్తున్నాడు -
సత్యానికి భాష నేర్పించి
మానవత్వానికి రూపు కల్పించి
అజ్ఞాన తమస్సు కళ్ళు తెరిపించిన
విజ్ఞాన ప్రజ్ఞాన గోవిందుడు వివేకానందుడు
కళ్ళు మూసుకున్నా........
రామకృష్ణ పరమహంస
ప్రేమ మానస సరోవరంలో
దివ్యానుభూతి జ్యోతిని దర్శించిన
అక్షరచక్షువు వివేకానందుడు

జనన మరణ తీరాల మధ్య
తరగలెత్తే జీవితాలకు
అనంతత్వ తత్వానందాన్ని
అనుభవైక సత్యానందాన్ని
అందిస్తున్న రససింధుడు వివేకానందుడు
కళ్ళు మూసుకున్నా........
మనిషి మనస్సును ఆవరించిన
స్వార్థ సంకుచిత విషవలయాన్ని
త్యాగబుద్ధి త్రికరణశుద్ధి యోగంతో
ఛేదించడం బోధించిన
సిద్ధేంద్రుడు వివేకానందుడు
కళ్ళు మూసుకున్నా........
తాను ధరించిన కాషాయాంబరాల నుండి
నీలి నీలాంబర నిగూఢ రహోవిహంగాలను
ఎగరవేసిన కాలవేది వివేకానందుడు
నరలోకాన్ని సురలోకం చేసే
మనిషిని మాధవుడుగా తీర్చే
యుక్తినీ ఆధ్యాత్మిక శక్తినీ
సకల బాషా విముక్తినీ ప్రసాదించిన
ఆత్మజ్ఞానేంద్రుడు వివేకానందుడు
కళ్లు మూసుకున్నా........
నిరుపేదలకోసం పరితపించే వాడే మహాత్ముడు
నిర్బల నిర్భాగ్యులను విస్మరించేవాడే దురాత్ముడు
అంటూ ఘోషించిన
మానవ సేవారాధకుడు వివేకానందుడు
అందరూ భయరహితులు కావాలని
మానవులందరూ
త్వమేవాహంగా తాదాత్మ్యం చెందాలని
ఆబాలగోపాలాన్ని అలరించే
అమృతవాక్కు వివేకానందుడు
"ఆనందో బ్రహ్మ" ఋక్కు వివేకానందుడు

# శ్రీ వివేకానందవాణి భారతీయ అంతర్వాణి

—శ్రీ పి.వి. రాజేశ్వరరావు

"భారతీయులారా! మీ ఆదర్శ సతీమణులు సీతయు, సావిత్రియు, దమయంతియునని మఱవకుడు. మీ దర్శించు దేవుడు గాఢ తపోనిష్ఠా గరిష్ఠుడును, సర్వసంగ పరిత్యాగియు, ఉమాకన్య యొక్క కఠిన తపస్సున కలరి ఆమెను పరిగ్రహించినవాడును ఆదిభిక్షువును అగు శంకరుడని మఱవకుడు. మీ వివాహములు, మీ సంపదలు, మీ జీవితములు ఇంద్రియ సుఖసాధనకొఱకు కూడ కాదనియు మఱవకుడు. భారతజననీ పూజాపీఠమున ఆహుతి అగుటకే మీరు జన్మించిరనియు మఱవకుడు.

"ఈ సాంఘిక వ్యవస్థ అఖండ విశ్వమాతృత్వముయొక్క ప్రతిరూపము మాత్రమే అనియు మఱవకుడు. నిమ్నజాతులు, పామరులు, దీనులు, విద్యావిహీనులు, చెప్పులు కుట్టువాండ్రు, పాకీవాండ్రు మీకు రక్త బాంధవ్యముగల స్వకీయులనియు, మీ సోదరులే యనియు మఱవకుడు.

"ఓ ధీరుడా! తలకకుము. ధైర్యము వహింపుము. నీవు భారతీయుడవని గర్వింపుము. 'నేను భారతీయుడను. ప్రతి భారతీయుడును నా సోదరుడు' అని గర్వముగా ప్రకటింపుము. 'భారతీయుడు నా సోదరుడు, భారతీయుడు నా ప్రాణము. భారతదేశపు దేవదేవీ బృందమే నా దైవము, భారత సంఘము నా శైశవమునాటి ఉయ్యేల. నా యౌవనమునాటి క్రీడావనము. నా వార్ధకమునాటి పుణ్యలోకము. నా వారాణసి' అని సగర్వముగా ఉచ్చైః స్వరమున ప్రకటింపుము. సోదరా! 'భారతదేశపు భూమియే నా అత్యున్నత

స్వర్గము. భారతదేశపు శ్రేయమే నా శ్రేయము' అనుము. రేయింబవళ్ళను ఈ ప్రార్థనను స్మరించుచుండుము.''

ఈ ప్రబోధం శ్రీ వివేకానంద స్వామిది. నూరేళ్ళక్రితం మ్రోగిన శంఖారావం. ఈనాటికీ ఆ పిలుపునకు కాలదోషం పట్టలేదు. నాటికీ నేటికీ వివేకానందుని సందేశం ఆధునిక భారతీయోపనిషత్తు. భారతీయుల అస్తిత్వానికీ, ఆత్మశక్తికీ, విశ్వప్రేమ దృష్టికీ, దేశభక్తికీ, స్వాతంత్ర్య రక్తికీ, సమాజ సేవానిరతికీ, త్యాగశీలానికీ, ఆధ్యాత్మిక నాయకత్వానికీ ప్రపంచ వ్యాప్తంగా ఆధునిక స్ఫూర్తితో, శాస్త్రీయ దృక్పథంతో, తర్కసహంగా ప్రాచుర్యాన్ని కలిగించిన వీరసన్యాసి శ్రీ వివేకానందులు.

యోగులకు సన్యాసులకు భారతీయ సంస్కృతిలో మాననీయమైన స్థానం ఉంది. వారు సామాజిక జీవితానికి గమ్యాన్నీ, గతినీ దర్శించి, విశ్వశ్రేయో భావంతో, స్వార్థ రహిత చింతతో నిర్దేశించటం తమ కర్తవ్యంగా భావిస్తారు. ఈ దేశంలో ఆధ్యాత్మిక నాయకత్వానికి ఆదికాలంనుంచీ అగ్రతాంబూలం అందించే ఆచారం ఉంది. అయితే, అటువంటి మాన్యస్థానంలో ఉన్న యోగులు, సన్యాసులు సమాజాన్ని ఏ దృష్టితో చూడాలి? అనే అంశంమీద శ్రీ వివేకానందస్వామి ఆధునిక దర్శనాన్ని మనకు అందించారు. మోక్షాన్ని సాధించటానికి కృషిచేస్తున్న సన్యాసిని గౌరవించి,అతని యోగక్షేమాన్ని సమాజం వహిస్తున్నది. తనకు భిక్షపెడుతున్న సమాజం యోగికి కంటియెదుట కనపడుతున్న పరమేశ్వర తత్వం. సమాజంలో పేదరికం పెచ్చుపెరిగిపోతే ఆధ్యాత్మిక చింతనను తనలోనూ, ఆధ్యాత్మిక సాధకులైన యోగులలోనూ, సన్యాసులలోనూ రక్షించుకోలేకపోతుంది. అందువలన శ్రీ వివేకానందస్వామి సమాజంలో పేదరికాన్ని ముందుగా నిర్మూలించాలనీ, అప్పుడు ఆధ్యాత్మిక చైతన్యం సహజంగా సమాజంలో జాగృతమౌతుందనీ పేర్కొన్నారు. ఇది ఆధునిక భారతీయ సామాజిక దృక్పథానికి మంచి ప్రాతిపదికను సిద్ధం చేస్తోంది. ఆర్థికావసరాలు అందరికీ ముందు తీరాలి; ఆ తరువాత ఆధ్యాత్మికంగా సమసమాజ భావనం చేయాలి. ప్రతి జీవునిలో దేవుణ్ణి చూచినప్పుడు, అతణ్ణి సేవించటమే కర్తవ్యమని భావించినప్పుడు సమాజంలో వర్గ, వర్ణ, ఉచ్చనీచాది తారతమ్యాలు అవంతట అవే తొలగిపోతాయని శ్రీ వివేకానందస్వామి బోధించారు.

"మీ సోదరమానవులపై మీకు ప్రేమ కలదా? భగవంతుని చూడగోరు వారెచటికో పోనేల? .... ఈ యందఱు పేదల, నిర్భాగ్యుల దుర్బలుల రూపమున కానిపించునదా భగవంతుడు కాడా? ప్రథమమున వీరి నేల ఆరాధింపరాదు? గంగాతీరములందు నూతులు త్రవ్వ శ్రమయేల? ప్రేమ సర్వశక్తిమంతమని నమ్ముడు. పేరు ప్రతిష్ఠలనెడు క్షణభంగు రాడంబర మెవరికి కావలెను? మీకు ప్రేమ కలదా? ఉన్నచో మీరు సర్వశక్తి సంపన్నులు; మీయందు స్వార్థతా లేశమైన లేదా? లేనిచో, మీ శక్తి నిర్నిరోధము. శీలమే సర్వత్ర శుభప్రదమైనది. ఓర్వలేనితనమును, దురహంకారమును విడనాడుడు. ఐకమత్యముతో ఇతరులను కూడి, లోకసేవ చేయ నేర్చుకొనుడు. మన దేశమున కిదియే అత్యావశ్యకము. ఓర్పు గలిగి, మరణ పర్యంతము విశ్వాసపాత్రులై మెలగుడు. మీలో మీరు కలహింపవలదు. ద్రవ్యవిషయమున నిష్కల్మషులై యుండుడు. శ్రద్ధయు, నీతియు, లక్ష్యమునందు నిష్ఠయు మీకున్నంత కాలము సర్వము వర్ధిల్లగలదు. మీలో మీకు భేదభావములు కలుగకుండునంత కాలము, భగవత్కృపచే మీకే విధమగు అపాయమును కలుగబోదని నేను దృఢముగా చెప్పగలను."

ఈనాడు మనిషిని ఆర్థిక ప్రమాణాలతో విలువకడుతున్నాం. కాని, దానికి పునాది ఆధ్యాత్మిక ప్రమాణాలై ఉండాలని శ్రీ వివేకానందస్వామి చెపుతున్నారు. ఆర్థిక ప్రమాణాలు మనుషులలో సమదృష్టిని తీసుకొని రావటం కష్టమని నేటి ప్రపంచ వ్యవస్థలో కూలిపోతున్న భౌతికవాద రాజ్యాలు చెప్పక చెపుతున్నాయి. భారతీయమైన సామాజిక భావం ఆధ్యాత్మిక సంస్కారం మీద ఆధారపడివుంది. అది వ్యష్టి సాధనతో సమష్టి సాధనగా సమగ్రమౌతుంది. శ్రీ వివేకానందస్వామి ఆ తత్వాన్ని ఈ శతాబ్దికి పాంచజన్యంలా పూరించి ప్రబోధించారు!

శ్రీ వివేకానందస్వామి సిద్ధాంతవేదాంతి కాదు. అనుష్ఠాన వేదాంతి. వేదాంతం సమాజ జీవితంలో ఆచరింపబడే జీవన విధానమని వ్యాఖ్యానించి చెప్పిన మహాత్ముడు. "స్వీయ మోక్ష ప్రాప్తిచే నేమి ప్రయోజనము? మధురాహారమును విశేష మనుభవించువా డెవడు? అంతయు తానే తినువాడా? అన్యులతో కూడి భుజించువాడా? సమస్త ప్రపంచమును మనతోకూడ మోక్ష సౌధమునకు కొనిపోవలయును. ఈ మాయా ప్రపంచమున మన మాధ్యాత్మిక దావాగ్నిని ప్రజ్వలింప జేయవలయును. అపుడే సచ్చిదానంద సామ్రాజ్యమున సుప్రతిష్ఠితమై

వెలయగలము. ఓహో! శాశ్వతానందమున తెసయగు నానంద మెద్ది? 'సర్వ భూతస్థ మాత్మానం స్వభూతాని చాత్మని' - తన్ను సర్వభూతములందును, సర్వభూతములు తనయందును గాంచునట్టి ఆ అనిర్వాచ్యస్థితిలో వివశులై మీరు బ్రహ్మానంద సాగరమున ఓలలాడెదరు. సమస్త జీవులందును నిరుపమాన ప్రేమ సానుభూతులను జూపుట మీకపుడు నైసర్గిక మగును. ఇదియే అనుష్ఠాన వేదాంతము."* ఈ అనుష్ఠాన వేదాంతమే భారతీయ జీవనంలోని పరమార్థ మూల్యాలను నిత్యజీవితంలో ప్రవహింపజేసే శక్తిమంతమైన సాధనంగా ప్రపంచమంతా ఈ శతాబ్దిలో గుర్తించింది. ప్రపంచశాంతికి, మానవ సౌభ్రాతృత్వానికి, సమసమాజ భావనకు అనుష్ఠాన వేదాంతమే అనువైన జీవనసూత్రమని మానవజాతి భావిస్తోంది. కాని అది అనుష్ఠానంలోకి అనువదింప బడటంలో చిత్తశుద్ధి చాల చోట్ల, ప్రపంచ దేశాల్లో లోపిస్తున్నది. అందువల్లనే నేడు శ్రీ వివేకానంద వేదాంత శంఖారావం ప్రపంచం పరవశించేటట్లు మరలా వినిపించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఈనాడు యువభారతి వారు ఈ 'వివేకానంద లహరి' ఉపన్యాస పరంపరను - విశ్వమత మహాసభలో శ్రీ వివేకానందస్వామి ఉపన్యసించిన ఉజ్జ్వల సన్నివేశానికి శతాబ్ద్యుత్సవాలు జరుగుతున్న సందర్భాన్ని పురస్కరించుకుని ఏర్పాటు చేశారు. సాహితీ సాంస్కృతిక సంస్థగా ఒక ఉత్తమ కార్యక్రమాన్ని చేపట్టి నిర్వహిస్తున్నారని నేను భావిస్తున్నాను. అందుకు అభినందిస్తున్నాను కూడా!

విశ్వమత మహాసభ ప్రపంచానికి ఇచ్చిన సందేశం ఏమిటి? దాన్ని గురించి కూడా శ్రీ వివేకనందస్వామి ఆ సభలో ఇచ్చిన చివరి ఉపన్యాసంలో ఇలా అన్నారు—

* ఈ వ్యాసంలో ఉద్ధరిస్తున్న వాక్యాలు వివేకానంద వాణికి చిరంతనానంద స్వామి తెలుగుసేత.

"If the Partiament of Religious has shown any thing to the world it is this: It has Proved to the world that holi- ness, purity, and charity are not the exclusive posessions of any church in the world, and every system has produced men and women of the most exalted character. In the face of this evidence, if anybody dreams of the exclusive survi- val of his own religion and the destruction of the others, I pity him from my bottom of my heart and point out to him that upon the banner of every religion will be soon be written, in spite of resistance: 'Help and not Fight', 'Assi- millation and not Destruction', 'Harmony and Peace and not Dissension.'

ఈ మాటలు శ్రీ వివేకానందస్వామి మనకోసం చెపుతున్నట్లుగా ఉన్నాయి. మతాల జెండాలమీద వివేకానందస్వామి సూక్తులు వ్రాయించి ఎగురవేయవలసిన కాలం మనం జీవిస్తున్న రోజులు. మతాల కన్నింటికీ సహజీవనం కంటె మరొక మనుగడ లేదు ఈనాడు. యుద్ధం కాదు వాటి నీతి - పరస్పర సహాయం! కూలగొట్టటం కాదు వాటి ప్రవృత్తి- కూడగట్టటం. విభేదం కాదు వాటికి కావల సినది జీవనసూత్రం; శాంతి సౌమనస్యాలు వాటికి కావాలి శ్వాసకోశాలు! ఆధునిక భారతం వివేకానందస్వామి సూక్తులను పాటిస్తే నిర్మాణాత్మకమైన అభ్యుదయ పథంలో, శ్రేయోమార్గంలో పయనింపగలుగుతుంది. అందుకే అంటున్నాను - నేటికీ వివేకానందవాణి భారతీయ అంతర్వాణి!

శ్రీ వివేకానందస్వామి వాఙ్మయాన్నంతా భారతీయ యువతీ యువకులు చదవాలి. చదివే అవకాశాలు కల్పించటంలో అటు విద్యాసంస్థలు, వ్యవస్థలు; ఇటు సాహిత్య, సాంస్కృతిక సంస్థలు, కళాకేంద్రాలు ముందుకు రావాలి, ప్రపంచానికి శాంతిని ప్రసాదింపగలిగింది భారతదేశమని పాశ్చాత్య మేధావులు. తత్వజ్ఞులు, శాస్త్రజ్ఞులు భావిస్తున్న ఈ తరుణంలో మన దేశాన్ని గురించి మన యువత ముందుగా అర్థం చేసుకొనే యత్నం చేయాలి. దానికి వివేకానందవాణి అభినవ వివేక చూడామణి.

వివేకానందస్వామి వారి దివ్యోపన్యాసాలు విని భారతీయతను స్వీకరించిన సోదరి నివేదితకు స్వామి వ్రాసిన లేఖ భారతీయ మహిళా జీవన సమున్నతిని తెలియపరుస్తున్నది:

"మాతృ హృదయంబు, వీరు నిశాత దీక్ష,
మలయ మారుతమునఁదోచు మధురిమంబు
వహ్నికీలా నిరర్గళోజ్జ్వలములైన
ఆర్య హోమాగ్నివేదికలందుఁ గల్గు
పరమపావన మంజులత్వము బలంబు
ఇవియు, పూర్వులకించుకే నెలుకలేని
ఇతరము లసంఖ్యములు నిన్ను నెనయుఁగాక!
భావిభారత సుతపరంపరల కీవ
ఒజ్జ, సఖి, దాసి- మూడునై యుందుగాక!"

పాశ్చాత్య నాగరకత వైపు పరవళ్ళు తొక్కుతున్న ఈనాటి యువతీ లోకం వివేకానందుని దివ్యవాణిని మననం చేసికొని భారతీయ సంస్కృతిని పునరుజ్జీవింప చేయవలసిన సమయం ఆసన్నమయింది. అందుకు ఈ శతజయంతి ఉత్సవాలు, ఉపన్యాసాలూ ఉపకరణాలుగా తోడ్పడగలవని నమ్ముతున్నాను.

నేటి భారతజాతికి శ్రీ వివేకానందస్వామి ఆశాజ్యోతి. భారతీయ సనాతన ధర్మాన్ని ప్రపంచ దేశాలకు వినిపించిన మహావక్త, విశ్వవిఖ్యాత భారతీయ ప్రవక్త శ్రీ వివేకానందస్వామి! భారతమాతను దర్శించి, ఆమె కన్నీటిని తుడిచి, ఆమె పుత్రులకు ఆమెను చూపించి, ఆమెకు అప్పుడున్న దాస్యశృంఖలాలను తొలిగించటానికి తొలిసారిగా పిలుపు నిచ్చిన వైతాళికుడు శ్రీ వివేకానందస్వామి!

ఐక్యరాజ్యసమితి కార్యదర్శిగా పనిచేసిన యుథాంట్ అన్నట్లు- ఈ 20 వ శతాబ్దపు పరిస్థితుల కనుగుణంగా ఆలోచనాశక్తిని, ఆధ్యాత్మికశక్తిని సమన్వయ పరచిన మహామనీషి వివేకానందుడు! ఆ సంయోజనం వల్లనే మనం ఇప్పటి సమస్యలను ఎదుర్కొగలుగుతున్నామని పేర్కొన్నా డాయన. ప్రపంచం వివేకానందుడు చూపిన వెలుగుబాటను నూరేళ్ళుగా స్మరిస్తోంది. మనం మాత్రం మరచిపోరాదు.

"అన్ని రకాల సామాజిక రాజకీయ వ్యవస్థలు స్థిరముగా నిలబడాలంటే మనుష్యుల శీలమే ప్రాతిపదికగా వుంటుంది. పార్లమెంటు సభ్యులు చేసే చట్టాల వలన ఏ జాతీ ఉన్నత దశ నందుకోలేదు. ఆ దేశ ప్రజలు గొప్పవారైతేనే ఆ జాతి గొప్ప స్థాయి నందుకుంటుంది. ప్రపంచంలో నున్న యావత్తు సంపద కంటె గూడ మనుష్యులు విలువైనవారు. ఒకవేళ మనకు కావలసిన అవసరాలన్నింటినీ ప్రభుత్వం సమకూర్చిందనుకోండి. వాటిని సద్వినియోగపరచగల శీలవంతులైన వ్యక్తులేరీ? కనుక అట్టి మనుష్యులను మొదట తయారుచేయండి" అన్న వివేకానందవాణి మానవ వనరులను అభివృద్ధి చేసుకుంటున్న మనదేశం అక్షరాలా పాటింపవలసింది! మానవ వనరుల విలువైన ఉపయోగం, వినియోగం శీలంగల వ్యక్తులమీదనే ఆధారపడి ఉంది. విద్యకు శీలం ఫలం: దేశానికి శీలం మూలం.

యువభారతి సాహిత్య రసికత్వం కలిగిన సమాజ చైతన్యం కోసం మూడు దశాబ్దాలుగా కృషి చేస్తున్నది. మానవత్వపు విలువలను పాటించుమని చెపుతూ పాటించి చూపుతున్నది. అందువల్ల 'వివేకానందలహరి'ని నిర్వహించే యోగ్యతను స్వయంగా సాధించింది. సమాజంలో 'వివేకానందవాణి' లాగానే 'యువభారతివాణి' సాహితీ సమాజంలో తన శంఖారావాన్ని కలకాలం పూరించాలనీ, తరతరాలను ఉత్తేజపరచాలని ఆశిస్తున్నాను; వార్షికోత్సవ శుభాకాంక్షలందిస్తున్నాను.

# ఆదర్శసన్యాసి వివేకానందుడు

—డా॥ టి. వి. నారాయణ

సర్వ సాధారణంగా సన్యాసి అంటే, సర్వసంగ పరిత్యాగంచేసి, కాషాయ వస్త్రధారణ చేసి; నదీ తీరాననో, వన ప్రాంతాలలో ఆసనం వేసుకొని, ఓంకార జపం చేసుకుంటూ, తన ముక్తిమార్గ సాధనలో నిమగ్నుడై యున్నవాడని అర్థం. తత్ విపరీతంగా స్వామి వివేకానందుడు నిద్రాణంలో, అవిద్యాంధకారంలో, సోమరితనంలో మ్రగ్గుతున్న తన తోడి సోదరులను మేలుకొల్పి, వారిని జాగరూకులుగ చేసి, అక్షరాస్యులుగ మలచి, సాహసోపేతులుగ తీర్చి దిద్ది, స్వయంకృషిచేసే కర్మనిష్ఠులుగ సిద్ధపరచి, స్వీయ జీవనోద్ధరణ చేసుకుంటూ సమాజ సేవ, దేశ సేవ చేయటంలో రతుడు కాగలిగినవాడే నిజమైన సన్యాసి అని, త్రికరణశుద్ధిగా నిరూపించిన ఆదర్శ సన్యాసి.

నిరాశకు, నిస్పృహకులోనై, దిశాహీనులు, మార్గహీనులైన భారతీయులను 'ఉత్తిష్ఠత, జాగ్రత!' అని వెన్నుదట్టి లేపి, "మీ జన్మభూమి భారతం మహోజ్వల, చరిత్ర గలది, ఒకనాడు ప్రపంచ దేశాలకు గురుత్వం వహించిన దేశం. మహోన్నతమైన ఆధ్యాత్మికత మీది. విశ్వజనీనత, ధార్మికత మీ సొత్తు" అని ఎలుగెత్తి చాటిన యతీశ్వరుడు స్వామి వివేకానందుడు.

"భారతీయుల్లారా! మీరు స్థితప్రజ్ఞుడు, యోగీశ్వరుడు ఐన శ్రీకృష్ణునికి; దయామయుడు, పతితోద్ధారకుడైన బుద్ధునికి వారసులు. లేవండి! కర్మనిష్ఠులు కండి. దరిద్ర నారాయణుల నుద్ధరించండి." అని శంఖారావము చేసిన చైతన్య మూర్తి వివేకానందుడు.

తన మాతృభూమియైన భారతదేశం అణువణువుని ప్రేమించిన అకళంక దేశభక్తుడు. ఆ పునీత దేశభక్తిని, ప్రతి భారతీయునిలో నిండార నింపాలని తహతహ పడిన ప్రేమమూర్తి. జాతి, మత ద్వేషాలతో ఛిన్నాభిన్నమై,

అనైక్యతకులోనైన సమాజంలో సంస్కరణాభిలాషను ప్రేరేపించిన సంఘో ద్ధారకుడు, సంఘసేవకుడు. జాతి పునరుజ్జీవనమునకై నిరంతరం కృషి చేసిన మహానుభావుడు వివేకానందుడు.

అగ్రవర్ణాల నుద్దేశించి స్వామీజీ యీ విధంగా బోధించాడు: "మీరు నడుస్తున్న శవాలు. రక్తహీనమైన,మాంసహీనమైన శవాలు. మీరు అస్థిపంజరాలు. మీ బలిష్ఠమైన వ్రేళ్ళలో విలువైన ఉంగరాలు కలవు. మీ పూర్వ్యజ్ఞులు దత్త మిచ్చిన సంపత్తు ఉన్నది. అదంతా ఇప్పటివరకు దానం చేయలేదు. మీ వారసుల కిచ్చివేయండి. వారిలో మీరదృశ్యంకండి. మీ స్థానంలో నవీనభారతం ఉద యిస్తుంది.

"నాగలి ధరించిన కృషీవలుల గుడిసెలనుండి, మత్స్యకారుల, చర్మ కారుల, శబరుల పాకలనుండి నవీనభారతం ఉద్భవమవుతుంది.వర్తకుల కొట్టుల నుండి, కర్మాగారాలనుండి, విపణి వీధులనుండి, వనాలనుండి, గుట్టలనుండి, పర్వతాలనుండి పుట్టుతుంది నవభారతం."

"వేల సంవత్సరాల నుండి అణగద్రొక్కబడిన సామాన్య ప్రజలు నోరు విప్పకుండా బాధలు, బీదరికం సహించారు. నితాంత దర్రిద్రాన్ని అనుభ వించారు. అందువల్ల వారిలో అంతులేని శక్తి చోటుచేసుకుంది. వారికి చారెడు శనగలిస్తే చాలు, ప్రపంచంపై ఉద్యమిస్తారు. సగం రొట్టె ప్రసాదిస్తే, ప్రపంచ మంతా వారి శక్తికి సరితూగలేదు. వారిలో అంతులేని రక్తబీజుని శక్తి ఇమిడీ కృతమై ఉన్నది. వారిలో విచిత్రమైన శక్తి, ప్రపంచంలో యెచ్చటలేని పవిత్రత, నైతికత నిండియున్నది. అట్టి ప్రశాంతత, సంతృప్తి, నిరంతర కర్మనిష్ఠత, అవసరమైనపుడు వారు ప్రదర్శించే సింహసత్వం ఎక్కడ లభిస్తుంది? పూర్వపు అస్థిపంజరాల్లారా! మీ సంపత్సర్వస్వం, మీ వారసులైన వారికి అప్పగించండి: సత్వరమే చేయండి. మీరు వారిలో అదృశ్యం కండి. మీ చెవులు మాత్రంవిప్పి ఉంచండి. విశ్వమంతా ప్రతిధ్వనిస్తూ, లక్షలాది గొంతుకల పునరుజ్జీవన భారతం నుండి బయలుదేరే అరపులు మీకు వినబడుతాయి" అని వివేకానందుడు హెచ్చరించాడు.

భారతదేశం యొక్క ఊపిరి ఆధ్యాత్మికత. ధార్మికత భారతీయుల పట్టుకొమ్మ. త్యాగం, సేవ మన జాతీయ ఆదర్శాలు. ప్రేమ, చిత్తశుద్ధి, క్షమ, విశ్వజనీనాలు - ఈ గుణాలే మన కవచాలు. తీవ్రమైన కర్మయోగం, అనంతమైన సాహసం, అంతులేని శక్తి ఇప్పుడు మన కవసరం. యువకుల నుద్దేశించి స్వామీజీ ఉద్బోధించిందేమిటంటే - "మీరు ఉక్కు కండరాలు, స్టీలు నరాలు పెంపొందించుకోవాలి. 'దరిద్రదేవోభవ, మూర్ఖదేవోభవ'. బీదలు, నిరక్ష్యరాస్యులను మీరు దేవతలుగా గ్రహించండి. వారి సేవే మహోన్నతమైన ధర్మమని గ్రహించండి.

"లక్షలాది అణగద్రొక్కబడిన దళితుల, శ్రమజీవుల, రక్తసిక్త శ్రమ కారణంగా ఉద్భవించిన ఐశ్వర్యంతో తులతూగుతూ తద్వారా విద్యావంతులైన వారిని, నేను నమ్మకద్రోహులనే అంటాను. ఆ పేద జనుల బాగును తలచని విద్యావంతులు దేశద్రోహులు అని నా నమ్మకం'" అంటారు స్వామీజీ.

"స్త్రీ జనుల, దళితుల ఉద్ధరణ మన ధ్యేయమై ఉండాలి" అని చాటి చెప్పాడు వివేకానందుడు.

"ఆత్మవత్సర్వభూతాని" అన్ని ప్రాణులలో పరమాత్మని దర్శించే తత్వం, విశ్వ శ్రేయస్సు కాంక్షించే బ్రహ్మత్వం, ధర్మాన్ని రక్షించే క్షాత్రం ప్రతి భారతీయుని ఆదర్శాలై యుండాలి" అని వివేకానందుని ఉద్బోధ.

# విశ్వమత మహాసభ

—డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి

జైన బౌద్ధులు, బ్రహ్మమతానుచరులు
క్రైస్తవ మహమ్మదీయు లఖండఫణితిఁ
బలికి రొక్కరే సభాపతియనుజ్ఞ
మిగిలియుండె నరేంద్రు గంభీరవాణి.

స్వమతౌన్నత్యమెకాని విశ్వజనతా సౌహార్ద సంపద్విధా
రమణీయార్థము శాంతిబోధన మొనర్పన్ బూనడెవ్వండు, అ
న్యమతద్వేష మెకాని సర్వమతగమ్య ప్రేమసిద్ధాంత రూ
పము రూపింపడెవండు సమ్మతసభాప్రాజ్ఞ ప్రపంచంబులో.

తలపై బంగరుపాగ, మోముపయి నూత్న బ్రహ్మతేజస్సు, ని
ర్మల కాషాయదుకూలశాటి చరణాగ్రంబంటి జీరాడ లే
దలిరుంబ్రాయపు దీప్తిపుంజములతోఁ దద్వేదికాంతస్థుడై
నిలువం బడ్డ నరేంద్రుమూర్తిఁ గనుచున్ నిశ్చేష్టులైరందఱున్.

సాదర దృష్టితోడ జనసాగరమున్ బరికించి శారదాం
భోదము గర్జనంబులిడు పోలిక, "పశ్చిమ ఖండ సోదరీ
సోదరులార!" యంచుఁదొలిసూక్తులు వల్కెనొలేదొ భూరి స
మ్మోద తరంగ చిహ్నములు మ్రోగె సుమీ కరతాళనాదముల్.

దారులు పెక్కు మోక్షఫలదామముఁజేరగఁగాని సృష్టి కా
ధారుఁడొకండెయన్నది యథార్థము, వాహినులెల్ల సాగరున్
జేరినయట్టు లీశ్వరునిఁజేరును సర్వమతంబులంచు వి
స్పారగతిన్ జగంబులకుఁ జాటెను మా ఋషిధర్మ మొక్కటే.

చినిగిన ప్రాతచేల నిరసించి, నవీన దుకూలముల్ ధరిం
చిన గతి నూత్నదేహియగు జీర్ణశరీరము వీడి యాత్మ, యీ
తనువను రమ్యసౌధమునఁ దాను వసించుటకున్ ఫలంబుగా
ననుభవమందుచుండుఁ జటులామయ రూపవిషాదవేదనల్.

తాను సృజియించు క్రొంబట్టుదారములను
బట్టువడినట్లు చివరకుఁ బట్టుపురుగు
సౌఖ్యవాంఛలు పెంచి పాశ్చాత్యజనులు
మోక్షమెఱుగక యూబిలో మునిగినారు.

ఈ కనిపించు భూతజగమే చెఱసాల, పరాత్పరుండె న్యా
యైక విభుండు జీవులు భవాంతర కర్మఫలానుభూతికై
కైకొనుచుంద్రు జన్మలిటఁ గాలము చెల్లినమీద, దుఃఖదూ
రీకృతమైన మోక్షము వరింతురు శాశ్వత దివ్యమూర్తులై.

అని యిట్లుంగి నమోఘవాక్కులఁ వివేకానంద కర్మంది ప్రా
క్తన వేదాంత మతంబు గంధహారియై గర్జింప, నుట్టూతలూ
గెను సంసద్భవనంబు, స్వామి ప్రతిభన్ గీర్తించినా, రమ్మహా
జనసంఘమ్ములు జైజయధ్వనులతో సంతోషబాష్పాలతో.

ఖండించె సముఖానఁ గ్రైస్తవ సంఘాల
 బూటకంపుఁ బ్రచారనాటకంబు,
అగ్గించెఁ బ్రీతితో అమెరికాదేశీయ
 సాంఘిక జీవన సౌఖ్య గరిమ,
విలపించె లోలోనఁదలచి భారతపుణ్య
 సాధ్వుల పసిడి పంజరపు బ్రతుకు,
తరలి రచ్చల కీడ్చెఁ దమ క్రీస్తు తత్త్వంబె
 తెలియని పాశ్చాత్య దీబలంబు,

చిన్ని పసిపాప నవ్వులో స్నేహగుణము
ఒఱను దూసిన చిఱుకత్తి కఱకుఁదనము
జత యొనర్చి "వివేకుండు" నలుపసాగె
వీర వేదాంత ధర్మ దిగ్విజయ యాత్ర.

అమ్మా! భారతి! నీ కుమారుడు వివేకానందు డీదూర ఖం
డమ్ముల్ చుట్టి, జగత్సభావిజయఘంటల్ విఖ్యాతి సౌ
ధమ్ముల్ మెట్టియుఁ దృష్టి నొందక, భవత్పాదాబ్జ సౌరభ్య లే
శమ్మాఘ్రాణము చేయవచ్చెడిని, వాత్సల్యాబ్ధి నోలార్పవే!

# యుగ చైతన్య వైతాళికుడు శ్రీ వివేకానందస్వామి

—ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

20 వ శతాబ్ది భారత పునరుజ్జీవన చైతన్యానికి శ్రీ రామకృష్ణ పరమహంస నాంది ఆలపిస్తే, శ్రీ వివేకానందస్వామి ప్రస్తావనను నిర్వహించారు. యూరోపు ఖండమంతా పారిశ్రామికంగా, భౌతికంగా, వైజ్ఞానికంగా పురోగమిస్తూ, హేతువాద యుగ చైతన్యాన్ని, భౌతిక స్పృహను, వైజ్ఞానిక చింతననూ గౌరవిస్తూ క్రొత్తయుగాన్ని నిర్మిస్తున్న సాహసాత్మకమైన కాలం పందొమ్మిదో శతాబ్దం. మానవత యాంత్రిక నాగరికతతో భోగమయ జీవితాన్ని అలవరచుకున్నా, ఆత్మపరమైన అమృతానుభూతిని, శాంతిని క్రమంగా కోల్పోతూ అశాంతికి, అలజడికి, దుఃఖానికీ, ఉద్వేగానికీ, అస్థిర భావానికీ బలి కావలసి వస్తోంది. అయితే, అటువంటి పరిణామాలకు కారణాలేమిటనే విచారణ వచ్చినపుడు యూరోప్‌ఖండ దేశాలు, తదితర పాశ్చాత్యదేశాలు బుద్ధిప్రామాణ్యాన్ని అంగీకరించే హేతువాదాన్ని ఆశ్రయించి మాత్రమే ఆలోచించేవి. భారతదేశం మీద పాశ్చాత్య ప్రభావం కొంత బలంగా పనిచేస్తున్న కాలమది. హేతువు అతీంద్రియ శక్తిని గుర్తించదు; ఆధ్యాత్మిక అనుభూతిని నిరూపించలేదు. అందువల్ల భారతీయులలో క్రమంగా సన్నగిల్లుతున్న ఆధ్యాత్మిక అనుభవ శక్తిని ప్రబోధించి ప్రజ్వలింప చేయాలన్న తీవ్రమైన తపన దేశంలో ప్రబలుతూ ఉండేది. అదే ప్రపంచ శాంతి సూత్రాన్ని అందించగలిగిన ఆశాకిరణంగా భారతదేశం ఎదురుచూస్తోంది.

భారతీయ ఆధ్యాత్మిక శక్తి పునరుజ్జీవన చైతన్య సూర్యోదయం శ్రీ రామకృష్ణ పరమహంసగా ఆవిర్భవించింది. ఆధ్యాత్మికానుభవం కోసం మానవ ప్రస్థానాన్ని స్వయంగా సాగించి చూపించిన మహాత్ములు శ్రీ రామకృష్ణులు. హేతువులు, తర్కాలు అనుభవం కోసం ఆరాటపడే బుద్ధి - శక్తుల ప్రవృత్తులు,

అవి అనుభవంతోనే సమాధాన పడతాయి. ఆత్మ సాక్షాత్కారం, దైవ సాక్షాత్కారం, ఆధ్యాత్మికానుభవం, 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' మొదలైన భారతీయ మూల్యాలు హేతువాద, భౌతికవాద, విజ్ఞానశాస్త్ర దృక్పథాలతో ఆస్తి నాస్తి విచికిత్సలో పడ్డప్పుడు శ్రీ రామకృష్ణుల ఆత్మ సాక్షాత్కారం ఆ మరుగు పడుతున్న మూల్యాలకు పునర్జీవితం కలిగించటమే కాకుండా, దేవుడున్నాడన్న విశ్వాసాన్ని, ఆ అనుభవం జీవిత సత్యమన్న అనుభవాన్ని కలిగించి సాంస్కృతికంగా భారతదేశంలో పునరుజ్జీవన చైతన్యాన్ని పునర్భవింప చేసింది. సర్వమతసార దర్శనంతో పరమహంస ఆధునిక భారతదేశానికి ఆధ్యాత్మిక జన్మనిచ్చారు.

ఆధునిక భారతానికి ఆత్మావిష్కారం చేసింది. శ్రీ రామకృష్ణ పరమహంస అయితే, ఆ ఆత్మ చైతన్యాన్ని అఖిల ప్రపంచానికి అందించిన కార్యశక్తి శ్రీ వివేకానందస్వామి. నరేంద్రునిగా పరమహంస ప్రసంగాలను, సమాధి స్థితులను చూచి, మనో వాక్కాయ కర్మలు అలా త్రికరణ శుద్ధిగా ఏకం కావటం గమనించి ఆశ్చర్యపోయాడు. నరేంద్రలో పందొమ్మిదో శతాబ్ది హేతువాద చైతన్యం ఆధ్యాత్మిక అనుభూతి కోసం అన్వేషిస్తున్నది భారతదేశంలో. అందుకే శ్రీ రామకృష్ణ పరమహంసను "మహాశయా! తాము దేవుని చూచారా?" అని సూటిగా ప్రశ్నించాడు నరేంద్ర. పరమహంస తడబాటు లేకుండా కుండబద్దలు కొట్టినట్టు "ఔను. నిన్ను జూచుచున్నట్లే భగవంతుని చూస్తున్నాను. ఇంతకంటె వేయి రెట్లెక్కువ విస్పష్టంగా చూస్తున్నాను. భగవత్సాక్షాత్కారాన్ని పొందవచ్చు; సూటిగా భగవంతునితో మాట్లాడవచ్చు"నని సమాధానం చెప్పాడు. ఆ మాటతో వేదార్థాలను అనుభవ సత్యాలుగా ఆవిష్కరించే ఉపనిషదాచార్యుడు మరలా భారతదేశంలో అవతరించిన అనుభవాన్ని అందించారు శ్రీ రామకృష్ణులు. వేదాంతం అనుభవ చైతన్యంగా వెలయింప చేశారు. హేతువు కంటె మనిషి ఎదగగలిగిన ఎత్తుగల ఆత్మసాక్షాత్కారం వాస్తవ సత్యమన్న విశ్వాసాన్ని ప్రపంచానికి ప్రసాదించారు. నరేంద్రుడు దర్శించిన భారతాత్మ శ్రీ రామకృష్ణ పరమహంస.

వేదాంతాన్ని అనుభవంలోకి తెచ్చిన గురువు శ్రీ రామకృష్ణ పరమహంస. దాన్ని జీవిత సాధనగా, జీవన మార్గంగా ఆచరించి, అనుభవ వేదాంత ఆచరణకు

ఆదర్శంగా నిలిచిన కర్మయోగి శ్రీ వివేకానందస్వామి. అనుభవ వేదాంతం అమెరికాలోని షికాగో నగరంలో జరిగిన విశ్వమత మహాసభలో వామనావతారంగా ప్రవేశించి త్రివిక్రమావతారంగా విజృంభించింది. భారతీయ సనాతన ధర్మ ప్రతినిధిగా, ప్రవక్తగా పరిమితమైన సమయంలోనే అపరిమిత ప్రభావాన్ని వేయగల ప్రబోధ చేశారు శ్రీ వివేకానందులు. ప్రతిక్షణం, ప్రతి మాట ఆధ్యాత్మిక అనుభవసార బిందువులా సభికులకు ఒక ఆత్మానుభవాన్ని అందించింది. నాల్క చేసే చమత్కారాలు, మెదడు ప్రదర్శించే ప్రయోగాలు, మనసు ఊగించే ఊయలలూ ఎన్నో విన్న సభికులకు స్వామి మాటల్లో ఆత్మను స్పందిపజేసే ఆధ్యాత్మికానుభవం అందుబాటులోకి వచ్చింది.

వేదాంత భేరి మ్రోగించిన శ్రీ వివేకానంద ఈ శతాబ్ది భారతీయ పునరుజ్జీవన చైతన్య రథ సారథి. శ్రీ రామకృష్ణ ఈ చైతన్యానికి పితామహుడు. వివేకానందులు విష్ణు సన్నిభులు. వివేకానందులు లేకపోతే రమణ మహర్షి, అరవింద ఘోష్‌వంటి యోగ సంప్రదాయం; రవీంద్రనాథ్ వంటి భక్తి వేదాంత మధుర సంప్రదాయం; తిలక్, గాంధీవంటి దేశనాయక పరంపర ప్రభవించేది కాదేమో! ఆధ్యాత్మికానుభవ మూలమైన దేశభక్తిని, విశ్వమత ధర్మానురక్తిని, స్వాతంత్రోద్యమ సంకల్ప శక్తిని వివేకానందుడే ఈ శతాబ్దికి అందించారు. వివేకానందుని వివేక కిరణాలే ఆధునిక భారత ఉద్యమ చరిత్రలు.

భారతీయాదర్శాలు ప్రధానంగా రెండు. ఒకటి - త్యాగం. రెండు - సేవ. ఈ రెండింటిని చతుర్విధాశ్రమాలలో పాటించాలని చాటి చెప్పిందీ; అన్ని దేశాలకు, అన్ని సంస్కృతులకు వర్తించే విశ్వజనీనమైన జీవన మూల్యాలని ప్రచారం చేసింది శ్రీ వివేకానందులే. సన్యాసాశ్రమంలో యోగి మోక్షప్రాప్తి కోసమే కృషి చేయాలన్నా 'సర్వేజనా స్సుఖినోభవంతు' అన్నట్లు సర్వజన హితం కోసం తానూ కృషి చేయాలని అన్నది మొదటి ఆదర్శానికి ప్రాతిపదిక. స్వార్థ త్యాగం వల్లనే లోకహితం సాధ్యం. సేవ వల్లనే అది ఆచరణలో అనుభవైక వేద్యం. శ్రీ వివేకానందుల వారి అనుష్ఠాన వేదాంతం ఈ మార్గంలో సాగుతుంది.

కన్యాకుమారి అగ్రంలో శిలపై కూర్చుండి గాఢ ధ్యానమగ్నులైన శ్రీ వివేకానంద స్వామి సన్యాసుల కర్తవ్యం సమాజ సేవగా దర్శించారు. దానిని

వ్యవస్థీకరించి శ్రీ రామకృష్ణ మహోద్యమంగా సాగించారు. పాశ్చాత్య దేశాలలోని వైభవం, కార్యదీక్ష, నిర్వహణా సామర్థ్యం భారతదేశంలోని పేదరికం నిర్మూలనకు సహకరించి, ఇక్కడి ఆధ్యాత్మికానుభవాన్ని పొంది, ప్రపంచ మానవత ఒక పరిపూర్ణ జీవిత లక్ష్యాన్ని సాధించాలని స్వామి మన దేశంలోనూ, విదేశాలలోనూ విరివిగా ప్రబోధించారు. వివేకానందవాణి ప్రాక్ పశ్చిమ జీవన ధారలకు ఆధ్యాత్మిక సంగమాన్ని అందించింది.

భారతదేశాన్ని శక్తిగా, తల్లిగా దర్శించి, ఆధ్యాత్మికంగా పొందే ఆత్మానుభవాన్ని దేశభక్తిగా, లౌకికంగా ప్రసరింపజేసే ప్రస్థానం వివేకానందుల వాక్కులలో శక్తిమంతంగా ముందుకు సాగింది. దైవం అనాథలలో బీదలలో అవతరించి ఉన్నాడనీ, వారిని సేవిస్తే దైవాన్ని సేవించినట్లేననీ సేవను ఆధ్యాత్మిక సాధనగా ఒక వెలుగుబాటను చూపించారు శ్రీ వివేకానందస్వామి.

''దీనులను గూర్చి ఎవ్వని మానసము క్షోభించునో వాడే మహాత్ముడు. క్షోభింపనిచో దురాత్ముడే....కోట్ల కొలది జనులు విద్యా విహీనులై క్షుధార్తులై దినములు గడుపుచుండ వారిని క్రీగంటనైనను జూడక, విశేషము వారి కష్టార్జితముచే తాము విద్యావంతులైనవారంతా దేశద్రోహులని నా అభిప్రాయము''- శ్రీ వివేకానందస్వామి.

ఈ మాటలు ఈ యుగ చైతన్యానికి ప్రస్తావన నిర్వహించిన సూత్రధారునివి. ఈనాడు లౌకిక వ్యవస్థలో పనిచేస్తున్న ఏ రాజకీయ పార్టీ అయినా తమ మానిఫెస్టోలో ఈ వివేకానంద స్వామి వాక్యాల వంటి వాక్యాలను వ్రాస్తున్నది. నూరేళ్ళ క్రింది స్వామి పిలుపు నేటికీ అవసరమైందిగా వినిపిస్తున్నది.

'మానవ సేవయే మాధవ సేవ', 'జీవసేవయే దైవసేవ'-అనే పిలుపులు నిజానికి ఆధ్యాత్మికమైన అనుభవం ప్రాతిపదికలుగా పలికేవి. వాటిని లౌకిక వ్యవస్థలో లౌకికంగా వాడుకుంటే రసంలేని పిప్పిగా; ఆత్మలేని ఆకృతిగా గోచరిస్తాయి. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మనదేశం వివేకానందులిచ్చిన పిలుపును యథాతథంగా నిలుపుకున్నట్లయితే సామాజిక శీలం ఎంతో ఉన్నతంగా ఉండేది; సామాజిక దుర్గతులు ఎన్నో సమసిపోయి ఉండేవి. ఇప్పటికీ మనకు మించిపోయింది లేదు. వివేకానంద మార్గంలో భారత జీవన పథాన్ని సాగిస్తే పునరుజ్జీవన యుగ చైతన్యం సార్థకం, సఫలం అవుతుంది.

# వివేకానంద జీవితం-సందేశం

రాష్ట్రకవి
—డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

"నమః శ్రీయతిరాజాయ వివేకానంద సూరయే
సచ్చిత్సుఖ స్వరూపాయ స్వామినే తాపహారిణే"
(స్వామీ జ్యోతిర్మయానంద)

1857 లో బ్రిటిష్ ప్రభుత్వమును కూలద్రోయుటకు జరిగిన స్వాతంత్ర్య విప్లవము విఫలమైన పిమ్మట నిద్రాణస్థితిలో పడిన హిందూ సమాజ సాగరమును 1893 లో తన చికాగో ఉపన్యాసముల ద్వారా తిరిగి కదిలించి మేల్కొలిపిన మహా వైతాళికుడు వివేకానందుడు. అది మొదలుకొని అతడు చేసిన బోధనలు బూడిదలో చిచ్చు రగుల్కొలిపినట్లు దేశభక్తిని రగుల్కొల్పి, 1902 లో అతడు దివంగతుడైన తరువాత మూడు సంవత్సరములకు అనగా 1905 లో విజృంభించిన "వందేమాతరం" ఉద్యమమునకు దోహదమొనర్చినవని చెప్పుట విశేషము గాదు. ఆతని చికాగో ఉపన్యాసములకు పూర్వము స్వామీ దయానంద సరస్వతి వేదములను క్రొత్త పద్ధతిలో ప్రామాణికముగ వ్యాఖ్యానించి ప్రచారము చేయుచు వైదికధర్మ రంగమునందును; మహర్షి బంకించంద్ర ఛటర్జీ ఆనందమఠం వంటి నవలను, వందేమాతరం వంటి జాతీయ గీతమును రచించి జాతీయ సాహిత్య రంగమునందును; లోకమాన్య బాలగంగాధర తిలక్ విద్యా సాంస్కృతిక పత్రికా రంగములద్వారా జాతీయ రాజకీయ రంగమునందును సృష్టించిన ఆధ్యాత్మిక సాంస్కృతిక చైతన్యస్ఫూర్తి వివేకానందుడు తలపెట్టిన హిందూ పునరుజ్జీవన మహోద్యమమునకు గొప్ప ప్రాతిపదికను నిర్మించినవనుట మామూలు మాట. అయితే ఆయా మహనీయులు సాగించుచుండిన యీ ఉద్యమము లన్నియు ఆయా ప్రాంతములకు మాత్రమే పరిమితమై అప్పుడప్పుడే బలము పుంజుకొను

చున్న సమయమది. అట్టితటి వివేకానందుని ఉపన్యాసములు వరద పొంగువలె ఒక్కుమ్మడి విజృంభించి జాతి మొత్తమును పులకింపజేయుట చరిత్ర పండించు కొన్న యదృష్టమని చెప్పుట ఏపాటి మాట?

సదరు విప్లవ సమయమున దేశమునందలి వివిధ ప్రాంతములతో పోల్చి చూచినప్పుడు వంగదేశము మిక్కిలి ప్రశాంతముగ నుండుట గమనింపవలసిన విషయము. దేశమునందు మరి యే యితర ప్రాంతములలోను లేని మోతాదులో పాశ్చాత్య సంస్కృతి వ్యామోహము గజ్జెకట్టిన ప్రాంతమది. కలకత్తా నగరము బ్రిటిష్ ప్రభుత్వమునకు కేంద్రస్థానము మనవారి యాహ్వానముపై ఆంగ్ల విద్యా బోధన విరివిగా వ్యాపించుచుండిన సమయమది. క్రైస్తవ మత ప్రచారము విజృంభించి, నడివీధులలో హిందూ దేవతలను దూషించుచున్న దుష్కాలమది! ప్రజలు తమ స్వంత మూల్యములను విస్మరించి పాశ్చాత్యులననుకరించుచు తమను తాము కించపఱచుకొనుచున్న స్థితికి దిగజారిన విపరీత పరిస్థితియది! కొన్ని కారణముల వలన 1857 నాటి విప్లవ సమయమున బెంగాలు ప్రశాంతముగ నుండెను. ఆశ్చర్యమేమన, ఈ విప్లవము విఫలమైన పిమ్మట ఈ స్వాతంత్ర్య భావన తిరిగి ఎప్పటికినీ తల యెత్తకుండునట్లు అణచివేయుటకు బ్రిటిషువారు సాగించిన దమనకాండ కారణముగ ప్రజల హృదయములనుండి "స్వాతంత్ర్యము" అను మాటయే మటుమాయమగుట!

1857 విప్లవము నాటికి రామకృష్ణుని వయస్సు సుమారు 21 సంవత్సరములు. ఇదంతయు గమనించుచున్న యాతని హృదయము కుదిలిపోవు చుండెను. అప్పటికే యాతడు దక్షిణేశ్వరమునకు చేరుకొనెను.

బాహ్యదృష్టికి లోకజ్ఞాన శూన్యుడైన పిచ్చివానివలె కాన్పించుచున్నను లోకజ్ఞుడైన మహాజ్ఞాని యాతడు. కాలము గడచుచుండెను. ఆతని వయస్సు పెరుగుచుండెను. తపస్సు పండుచుండెను. అన్నింటినీ మించి సామాజిక స్పృహ మిక్కుటమగుచుండెను. దిగజారుచున్న సామాజిక పరిస్థితులను చూసి మిక్కిలి వగచుచుండెను. ఆతనికి తటస్థపడిన వ్యక్తులలో ఎందరెందరో మహనీయులైన మేధావు లుండిరి. కాని వారెవ్వరిలోనూ రామకృష్ణునకు సిద్ధాంత సమగ్రత గోచరింపలేదు. ఏదో భావదారిద్ర్యము, అరకొఱల యాలోచనలు మాత్రమే

కానవచ్చుచుండెను. వీరందరికిని ఇంగ్లీషు వచ్చును. తనకు రాదు. ఈ పరిస్థితులలో హిందువులను స్వీయధర్మమార్గమునకు మళ్ళించి నడిపింపగల గొప్ప నాయక లక్షణోపేతుడైన, ఇంగ్లీషు వచ్చిన, సిద్ధాంత సమగ్రత గలిగిన పూర్ణ పురుష డొకడు తనకు కావలయును. అట్టివానికై యాతడు చిరకాలము ప్రతీక్షించుచుండెను. చివరికి నరేంద్రుడు లభించెను. వ్యక్తులను అంచనా వేయుటలో రామకృష్ణుడు చాల దిట్ట. తన దగ్గరకు వచ్చుచుండిన వ్యక్తులను గూర్చి యాత డిట్లు పలుకుచుండెడివాడు :

"ఇచ్చటికి వచ్చు ముముక్షువులలో నరేంద్రునకు నరేంద్రుడే సాటి. వీరిలో నొకడు అష్టదళపద్మము, మఱియొకడు షోడషదళ పద్మమునైనచో నరేంద్రుడు సహస్రదళ పద్మము."

"ఒక మహాలక్షణముచే కేశవచంద్ర సేనుడు ప్రఖ్యాతుడైనచో అట్టి లక్షణములు నరేంద్రుని యందు పదునెనిమిది గలవు. కేశవునందును, విజయునందును జ్ఞానము దీపమై వెలుగుచుండ నరేంద్రునందయ్యది ప్రచండ సూర్యబింబమై ప్రజ్వలించుచున్నది!"

## నరేంద్రుని యవతారము

స్వామీ వివేకానంద దుందుభినామ సంవత్సర పుష్య బహుళ సప్తమీ సోమవారం క్రీ.శ. 1863 జనవరినెల 12 వ తేదీనాడు ఉదయం 6-45 నిమిషములకు సూర్యోదయముతో పాటు ఉత్తర కలకత్తాలోని హేదువర్ సమీపమున షిమూలియా పల్లెలో గౌరుమోహన్ ముఖర్జీగారి వీధిలోని తమ పూర్వీకుల యింటిలో జన్మించెను. ఆతని అసలుపేరు నరేంద్రనాథదత్త. ముద్దుగా నరేన్ అనియు, బిలే అనియు పిలుచుచుండెడివారు. సన్యాస్రాశమమున ప్రవేశించిన కొంత కాలమునకు పిమ్మట వివేకానంద నామమును స్వీకరించెను. తల్లిపేరు భువనేశ్వరీదేవి. తండ్రిపేరు విశ్వనాథదత్త. వీరిది దత్తవంశము. పితామహుడు దుర్గాచరణదత్త న్యాయశాస్త్రము నందును, సంస్కృతము నందును గొప్ప పండితుడు. కొడుకు విశ్వనాథదత్త జన్మించిన తరువాత దుర్గాచరణుడు తన 25 వ యేటనే సన్యాసమును స్వీకరించెను. విశ్వనాథుడు కలకత్తాలో అటార్నీగా నుండెను. కొంత పాశ్చాత్య సంస్కృతి ప్రభావము ప్రసరించిన వ్యక్తి.

భువనేశ్వరీదేవి మహా యిల్లాలు. మంచి ధార్మిక నిష్ఠ గలది. ఈ దంపతులకు కాశీవిశ్వేశ్వరుని యనుగ్రహము వలన జన్మించిన పుత్రుడే నరేంద్రుడు. శైశవమునుండియు తల్లి భువనేశ్వరీదేవి బోధించిన మన ప్రాచీన పురాణగాథలు రామాయణ, భారత, భాగవతాది గ్రంథముల ప్రభావము ఈతనిపై తిరుగులేని యాధ్యాత్మిక సంస్కృతి ముద్రను వేసినవి. బాల్యమునుండియు ధైర్యసాహసములు, దీనులయెడ సానుభూతి, మహనీయులయెడ ఆదరాభిమానములు కలిగి యుండెను. సంగీతమన్న ప్రాణము. సింహ సౌందర్యము, మాధుర్యమొల్కిపడు గళస్వరము, అసాధారణమగు మేధోవిలసనము గలిగి, తోటివారలలో తిరుగులేని నాయకుడై వర్ధిల్లిన మహితాత్ముడీతడు.

## విద్యాభ్యాస విశేషములు

నరేంద్రునకు బాల్యమున తల్లియే ప్రథమ గురువని చెప్పుట మామూలు మాట. ఎనిమిదేళ్ళ వయస్సులో నాతడు కలకత్తాయందలి పండిత ఈశ్వర చంద్ర విద్యాసాగరుని మెట్రోపాలిటన్ ఇన్స్టిట్యూట్‌లో రెండవ తరగతియందు ప్రవేశించెను. ఈశ్వరచంద్రుడు ఆనాడు ప్రసిద్ధిచెందిన విద్యావేత్తలలోను సంఘ సంస్కర్తలలోను నొకడు. నరేంద్రుడు తోటి బాలురతో కలిసి తరగతిలో ఉపాధ్యాయులతో అప్పుడప్పుడు తమాషాకు చిన్నచిన్న ఘర్షణలు పడుచుండెడి వాడు. ఆ తగాదాలను ఈశ్వరచంద్రుడు తీర్చుచుండెడివాడు. ఆ పరిచయమును పురస్కరించుకొని విద్యాసాగరునకు నరేంద్రునిపై మిక్కిలి వాత్సల్యము. ఈశ్వరచంద్రునియొక్క మహనీయ వ్యక్తిత్వ ప్రభావము నరేంద్రునిపై కొంత ప్రసరించినది. అనంతర మాతడు పదునారేండ్ల వయస్సులో ప్రవేశపరీక్షయందు త్తీర్ణుడై ఉన్నత విద్యకొఱకు కలకత్తాయందలి ప్రసిడెన్సీ కళాశాలలో చేరెను. గణితము సందాతనికి నంతగా నాసక్తి లేకుండెను. ఇంగ్లీషు పరభాష యగుట వలన నది నేర్చుకొనుటకు తొలుత నాతడు నిరాకరించెను. కాని దాని యావశ్యకతను అర్థము చేసికొన్నపిమ్మట ఆంగ్ల భాషా మహాసాగరమున గజయీతగాడయ్యెను. దేశచరిత్ర, సంస్కృతము మొదలగు విషయములందు గొప్ప ప్రావీణ్యమును సంపాదించెను. అసలే పుంసాం మోహనరూపుడు; దానికితోడు యౌవనశోభతో విరాజిల్లుచుండెను. స్థిరప్రజ్ఞాలక్షణములను సంతరించుకొనుచుండెను. అసాధారణమగు వివేకము వికసింపదొడగెను. అపారమైన ధారణా

శక్తి యేర్పడెను. సత్యాన్వేషణ అధికతరమయ్యెను. ఆలోచనా విధానము పావనభక్తిభావబంధురమయ్యెను. విదగ్ధ వచనత్వము, కార్య శూరత్వము సహజగుణములై ప్రకాశించుచుండెను. మితిమీరిన జిజ్ఞాస అతనిని వేధించుచుండెను. అప్పుడే యీతడు తొలిసారి రామకృష్ణ పరమహంసనుగూర్చి వినెను. ఒకనాడు తాను చదువుకొనుచున్న కళాశాలకు ప్రిన్సిపాలుగానున్న ప్రొఫెసర్ విలియం హేష్టీ వర్డ్సు వర్తు వ్రాసిన "ఎక్సకర్షన్'' అను కవితను పాఠము చెప్పుచుండెను. అందు ప్రతిపాదింపబడిన దివ్యానుభూతిని గూర్చి వివరించుచు అట్టి దివ్యానుభూతిని పొందిన మహనీయుడొకరు దక్షిణేశ్వరమునందున్నాడనియు, అతడు రామకృష్ణ పరమహంసయనియు, తానాతనిని స్వయముగా దర్శించితిననియు చెప్పెను. విలియం హేష్టీకి నరేంద్రుడన్న మహా వాత్సల్యము. అతడొకసారి యిట్లు ప్రకటించెను: ''నేను ఎన్నియో దేశములను పర్యటించితిని కాని నరేంద్రునివంటి మేధాశాలిసనముగల విద్యార్థిని జర్మనీ విశ్వవిద్యాలయములలో చదువుచున్న తత్త్వశాస్త్ర విద్యార్థులలోగూడ చూడలేదు. ప్రపంచమాతని ప్రతిభను గుర్తించు రోజులు తప్పక వచ్చి తీరును ''

## రామకృష్ణ పరమహంస దర్శనము

శ్లో॥ కుర్మస్తారక చర్వణం త్రిభువన ముత్పాటయామోబలాత్
భో! నవిజానా స్యస్మాన్ రామకృష్ణదాసావయమ్.

"నక్షత్రములను రాల్చిపార వేయగలము. ముల్లోకములను కూకటివ్రేళ్ళతో పెకలించి వేయగలము. ఓహో! మేమెవరమో నీకు తెలియదు కాబోలు! రామకృష్ణ పరమహంస దాసులం" అంటారు వివేకానందు లొకచోట! ఎంత గురుభక్తి! ఎంత ఆత్మవిశ్వాసం! ఎంత భావజ్వాల! ఋక్కు వలె ఋతంభరమైన మహా శ్లోకమిది!

నరేంద్రుడు రామకృష్ణుని వంటి గురువు కొఱకు అన్వేషించు చున్నప్పుడు రామకృష్ణుడు నరేంద్రుని వంటి శిష్యుని కొఱకు నిరీక్షించుచున్న సమయమది! భగవంతుని ఉనికిని గూర్చియు, తత్సాక్షాత్కారానుభూతిని పొందిన మహనీయుల ఉనికిని గూర్చి తెలిసికొని, తన్నిర్దిష్టధ్యేయ మార్గమున పయనింపవలెనని నరేంద్రుని తహ తహ! లోకసంగ్రహము కొఱకు ఆత్మనిరతితోను, ఆత్మనిష్ఠుతల్ప

భావముతోను తపించి పనిచేయగల కర్మయోగి ద్వారా మానవ కల్యాణమునకు త్రోవలు తీయవలెనని రామకృష్ణుని తపన! రామకృష్ణుడు మంత్రము; కాగల వివేకానందుడు తంత్రము. ఒకరు ప్రవక్త; మరొకడు ప్రవర్తకుడు. ఇదొక లోకోత్తరమైన గురు శిష్యుల జంట. ఆయా యుగములలో మన సమాజమును నడిపించిన గురుశిష్యుల జంటలు కొన్ని గలవు. శ్రీకృష్ణార్జునులు, చాణక్యచంద్రగుప్తులు, విద్యారణ్య హరిహరులు, సమర్థ రామదాస ఛత్రపతి శివాజీలు, ఇరుగో ఈ రామకృష్ణ వివేకానందులు. ఒకానొక వేళావిశేషమున జరిగిన యీ యిర్వురి కలయిక చరిత్ర పండించుకొన్న యదృష్టమునకు ప్రతీక యనుట మామూలు మాట! నరేంద్రుడు రామకృష్ణుని కలియుటకు పూర్వము కొంచెము ముందు వెనుకలుగ బ్రహ్మసమాజములో చేరి పనిచేయుచుండెను. భగవంతుడు నిరాకారుడయ్యును సగుణుడని బ్రాహ్మమతస్థుల విశ్వాసము. ఏదియెట్లున్నను భగవత్సాక్షాత్కారమును పొందనిదే జీవితము వ్యర్థమని యాతనిలంపు "భగవంతుడున్నాడు", "నేను చూచితిని", "నీకు చూపింపగలను" అని చెప్పగలవాడిప్పుడు తనకు కావలయును. కనబడిన విజ్ఞులందరిని మీరు భగవంతుని చూచితిరా? యని ప్రశ్నించి నిరాశపడుచుండెడివాడు. ఒకనాడు రవీంద్రుని తండ్రియగు దేవేంద్రనాథటాగోరును కలిసికొని అదే విషయమును ప్రశ్నించెను. అతడు సమాధానము చెప్పజాలక "నాయనా! నీవు యోగినేత్రములు" అని మాత్రము పలికి యూరకుండెను. నరేంద్రుడు నిరుత్సాహపడెను. ఇట్లుండనాతని బంధువగు రామచంద్రదత్తుడొకనాడు. "బిలే, నీకు పరమార్థమే ధ్యేయమైనచో బ్రహ్మ సమాజమునకు పోవుట ఎందులకు? రామకృష్ణునికడకు పొమ్ము"అని ప్రేరేపించెను. అప్పుడాతడు ఒకానొక క్రమములో రామకృష్ణుని పలుమారులు సందర్శించెను. వానిలో మూడు నాల్గు సందర్భములు చాల ముఖ్యమైనవి. వాటిని గూర్చి మాత్రమే యిట ప్రస్తావింపబడుచున్నది :

అది 1881 నవంబరు నెల. నరేంద్రుడు ఎఫ్.ఏ. పరీక్షకు తయారగుచున్న రోజులు. సురేంద్రనాథ మిత్ర అను పేరుగల రామకృష్ణుని భక్తుని యింటిలో నాతనిని మొట్టమొదటిసారి కలుసుకొనెను. మిత్రా యొక్క కోరికపై కొన్ని భక్తిగీతముల నాలాపించెను. అందులో ఒక గీతముయొక్క కొన్ని పంక్తులివి :— "మన్ చలో నిజనికేతనె సంసార విదేశే విదేశిర్ వేషె భ్రమకెనా అకారణె"- (మనసాస్వస్థానమునకు వెడలుదము రమ్ము! విదేశమగు నీ సంసార

మున పరుడవై యేల పరిభ్రమించెదవు?) ఇది విన్నంతనే రామకృష్ణుని గుండెలు పులకరించెను. అతని లోకోత్తర దేహసౌందర్యము, ఊహాతీత మాధుర్యముట్టిపడు గళస్వరము, ఆ పాటయందలి తాత్త్విక భావ రహస్యము అతనిని యానంద ముతో విలవిల లాడించినవి. బావస్థిరమైన జనసాంతర సౌహృదముప్పొంగినది. "ఎంత కాలమునకు వచ్చితివోయీ! తండ్రీ! యింతవఱకెట్లు నిర్దాక్షిణ్యము వహించితివోయీ!" అని తహతహలువోవుచూ, సెలవు తీసికొని వెళ్ళిపోవుచున్న నరేంద్రునితో "మఱల త్వరలోనే దక్షిణేశ్వరమునకు రావలయును సుమా!" యని ప్రాధేయపడుచున్నట్లు కోరెను.

అది 1881 డిసెంబరు నెల. నరేంద్రుడు రెండవసారి దక్షిణేశ్వరమున రామకృష్ణుని దర్శించెను. ఇదొక చరిత్రాత్మకమైన సన్నివేశము. రామకృష్ణుడొక జీవన్ముక్తుడు. నరేంద్రుడొక జిజ్ఞాసువు. అతడొక జాగృత దివ్యచైతన్యము. ఇతడొక సుప్త చైతన్యము. ఇతడు రవ్వ. ఇకముందు ప్రజరిల్లబోవువహ్ని. రెండు తేజఃపుంజములు సన్నిహితమైన విచిత్ర పవిత్ర సన్నివేశమది. ఇతడడుగును; అతడు చెప్పును: భగవంతుడున్నాడా? ఉన్నాడు, మీరు చూచితిరా? చూచితిని, ఎట్లుండును? నీవలెనుండును. నీలోనే ఉన్నాడు. నీవే భగవంతుడివి. నిన్ను చూచుచున్నట్లే యాతనిని చూచితిని. మఱింత స్పష్టముగా చూచితిని. అంతే; ఆ చైతన్యమీతనిని స్పృశించినది. ఈ జడ జీవితము పలికినది. నిర్వికల్ప సమాధి గతమై మేల్కొన్నది. ఆ దక్షిణేశ్వర ముని హంసకు లొంగిపోయినది. అతనికిదొక పరమాద్భుత రమ్యదివ్యానందానుభూతి! నరేంద్రుడు రామకృష్ణుని కడకు ఈ రెండవసారి పోవునప్పుడు త్రోవలో "ఒకవేళ రామకృష్ణుడుగూడ తాను భగవంతుని చూడలేదని చెప్పినచో నేనేమి చేయుదును?" అని దిగులుతో కూడిన తహతహతో వెళ్ళెను. కాని ఎండి బీటలు వారిన తన యెదలో రామకృష్ణుని వచనామృతపు తొలకరిజల్లు కురిసిన పిమ్మట తానొక పూర్ణపురుషుడైనట్లు ఆనందించెను.

అది 1886 ఆగస్టు రెండవ వారము. ఒకరోజు నరేంద్రునితో సహా, శిష్యులందరు రామకృష్ణుని చుట్టునూ చేరి ఆనంద కోలాహలముగ ముచ్చటలాడుకొనుచుండిరి. వారిని చూచి రామకృష్ణుడు నరేంద్రుని నాయకత్వమున తన శిష్యులందరు చక్కగా సంఘటిత పడినారనియు మంచి క్రమశిక్షణగల యువ

బృందముగా వారు మానవ కల్యాణమునకు అంకితమై కృషి చేయగలరనియు భావించి మిక్కిలి తృప్తి చెందెను. ఆ సమయమున నరేంద్రుని మనస్సులో రామకృష్ణుని యవతారతత్త్వ రహస్యమునకు సంబంధించిన సందేహములింకనూ తెగక కొన్ని నిలిచియుండెను. వాటిని నిస్సందేహముగా నివృత్తి చేసికొనదలచి యేదియో యడుగబోవుచుండెను. అతని మనస్సును పసిగట్టిన పరమహంస స్పష్టముగా నిట్లు పలికెను: "నరేన్! నీకింకను సందేహముగనే యున్నదా? వినుము: ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో, అతడే యీ దేహమున రామకృష్ణుడైయున్నాడు; కాని నీ వేదాంతము ప్రకారము కాదు సుమా!" శ్రీరామకృష్ణుని యొక్క యీ యవతార తత్త్వమును దృష్టియందుంచుకొనియే కాబోలు నరేంద్రుడు తాను వివేకానందుడైన పిమ్మట గురుదేవుని యిట్లు స్తుతించినాడు:

శ్లో॥ ఆ చండాలాప్రతిహతరయోయస్య ప్రేమప్రవాహః
లోకాతీతోప్యహహ న జహౌ లోక కల్యాణమార్గమ్
త్రైలోక్యేఽప్యప్రతిమ మహిమా జానకీ ప్రాణబంధో
భక్త్యాజ్ఞానం వృతవరవపుః సీతయాసోహి రామః.

"ఏ శ్రీరామచంద్రుని యొక్క ప్రేమ ప్రవాహము చండాలుని మొదలుకొని సకల ప్రాణికోటులయందును తిరుగులేని యురవడి పరవడులతో సమభావముతో ప్రవహించుచుండునో, ఎవడు లోకాతీతుడయ్యును లోక కల్యాణ మార్గమును విడువక నిరంతరము నిర్వహించుచుండునో, జానకీదేవి యొక్క ప్రాణ నాయకుడైన ఏ రాముని మహిమ ముజ్జగముల యందు సాటి లేనిదో, భక్తి జ్ఞానమును వరించినట్లు ఎవనిని సీతాదేవి వరించినదో అట్టి యా రాముడునూ" - తరువాతి శ్లోకముతో నన్వయము

శ్లో॥ స్తబ్ధీకృత్యప్రలయకలితం వాహవోత్థంమహాంతం
హిత్వారాత్రిం ప్రకృతిసహజా మంధతామిశ్రమిశ్రామ్
గీతం శాంతం మధురమపి యః సింహనాదం జగర్జ
సోఽయంజాతః ప్రథిత పురుషః రామకృష్ణ స్త్విదానీమ్.

"ప్రళయ సమయమున నుప్పతిల్లునట్లు కురుక్షేత్ర మహా సంగ్రామమున నుప్పతిల్లిన మహానాదమును స్తంభింపజేసి యర్జునుని యావరించిన అజ్ఞానాంధ

కారమును పటాపంచలు చేసి యెవడాతనిని తొలుత శాంతముగను, మధురము గను, పిమ్మట నాతడింకను మారాము చేయుచున్నప్పుడు సింహము గర్జించునట్లు గంభీరముగను గీతను ప్రబోధించెనో అట్టి యా కృష్ణుడును కలిసి ప్రథిత పురుషుడగు నీ రామకృష్ణుడుగా నవతరించెను."

కావ్యమునకు ఆత్మ ధ్వని యందురు. ఈ రెండు శ్లోకములందును చక్కని వస్తుధ్వనులున్నవి. మొదటి శ్లోకమున భక్తి జ్ఞానమును వరించినట్లు సీత రాముని వరించెననిగదా చెప్పబడినది. అప్పుడు సీతవంటి శారదాదేవి రాముని వంటి రామకృష్ణుని వరించినది అన్న మధురమైన ధ్వని సిద్ధించుచున్నది. రెండవ శ్లోకమున కృష్ణు డర్జునునకు గీతోపదేశము చేసెననిగదా చెప్పబడినది. అప్పుడు కృష్ణునివంటి రామకృష్ణుడు, అర్జునుని వంటి వివేకానందునకు గీత వంటి యుపదేశమేదో చేసినట్లు అందమైన ధ్వని సిద్ధించుచున్నది. ఇట్లీ రెండును రెండు లోకోత్తర శ్లోకములై యొప్పుచున్నవి. పరమహంస పరమపదించిన పిమ్మట వ్రాసిన యీ శ్లోకములను నరేంద్రుడు భజన కార్యక్రమములలో స్వయముగా పాడుచుండెడివాడు!

అది 1886 ఆగస్టు 15, 16 తేదీలలో ఏదో ఒకనాడు. రామకృష్ణుడు తానిక మహాసమాధిలోనికి వెళ్ళవలసిన సమయ మాసన్నమైనదని గ్రహించెను. ఇన్నాళ్ళుగ తా నాశించిన విధముగ నరేంద్రుని ప్రాణబింబము పూర్ణబింబత్వ మును సంతరించుకొన్నదను నిశ్చయమునకు వచ్చెను. ఇప్పటివరకు తాను సంచిత మొనర్చిన తపశ్శక్తుల నన్నింటిని యాతనికి "శక్తిపాతము" అను ప్రక్రియ ద్వారా ధారవోయుటకు సంకల్పించెను. నిశ్చితమగు నొకానొక వేళా విశేషమున నరేంద్రుని పిలిచి తనయెదుట కూర్చుండబెట్టుకొని యాతని వంక తదేక దృష్టితో చూచుచు ధ్యాన నిమగ్నుడయ్యెను. వెంటనే అదే క్రమములో యేదియో ఒక సూక్ష్మశక్తి తరంగము విద్యుత్ప్రసారమువలె తనలో ప్రవేశించు చున్న యనుభూతి నరేంద్రునకు కలిగెను. అతడు బాహ్యస్మృతిని కోల్పోయెను. కొంత వడికి తిరిగి తెలివికి వచ్చెను. పరమహంస నేత్రములనుండి ఉబికి వచ్చుచున్న బాష్పధారలను చూచి యాశ్చర్యచకితుడై కారణ మడిగెను. తన యాధ్యాత్మిక శక్తులన్నింటిని నరేంద్రునకు ధారవోసిన విషయమును వెల్లడించి, యా శక్తిచే నరేంద్రుడు జగత్కల్యాణ కారకములైన ఘనకార్యము లొనరింప

గలదని మంగళాశాసనము చేసెను. గురువు శిష్యుని పలువిధముల పరీక్షించి యాతడు సర్వవిధముల యోగ్యుడైనాడని భావించిన పిమ్మట నిశ్చితమగు నొకానొక పవిత్రవేళావిశేషమున నాతనికి తన శక్తులను ధారవోయు ప్రక్రియను "శక్తిపాత" మందురు. ఆ వేళావిశేషము ఒక్క నిమేషము మాత్రమే యుండు నట. సరిగ్గా నా సమయమున నిది జరుగవలెనని శాస్త్రప్రమాణము. ఈ ప్రక్రియ ద్వారా శక్తిపాతము జరిగిన పిమ్మట ధారవోసిన వ్యక్తి నిర్వీర్యుడు, నిస్తేజుడు అయిపోవును. రామకృష్ణుడు తానిప్పుడు "ఫకీరు" నైతిని యనియు చెప్పెను.

అది 1886 ఆగస్టు 18 వ తేది. శ్రావణ కృష్ణ పాడ్యమీ ఆదివారము, అర్ధరాత్రి ఒంటిగంటకు రామకృష్ణ పరమహంస మహా సమాధిలో ప్రవేశించెను. జన్మించినది 1936 ఫిబ్రవరి 18 వ తేది ఫాల్గుణ శుక్ల ద్వితీయా బుధవారము నాడు. అనగా ఏబది సంవత్సరముల ఆరునెలలు మాత్రమే జీవించిరి. ఈ అవతార మూర్తిని గూర్చి వివేకానందుడు వ్రాసిన యీ క్రింది శ్లోకము నరయుడు :

శ్లో॥ పీత్వా పీత్వా పరమ మమృతం వీత సంసారరాగాః
హిత్వా హిత్వా సకల కలహప్రాపిణీం స్వార్థ సిద్ధిమ్
ధ్యాత్వా ధ్యాత్వా గురువర పదం సర్వకళ్యాణ రూపం
నత్వా నత్వా సకల భువనం పాతుమామంత్ర యామః.

"అయ్యలారా! ఈ సంసార తాపత్రయములను విడనాడి రామకృష్ణుని సేవలచే లభింపగల యమృత సారములను గ్రోలుడు. కలహములన్నింటికినీ కారణమైన స్వార్థమును విడనాడి సర్వకల్యాణ ప్రదములైన రామకృష్ణుని చరణములను సేవింపుడు. ఓ విశ్వమానవులారా! రండు, రామకృష్ణుని పాదామృతపానముచే తరింపవలసినదిగా మీకు మాటికి నమస్కరించి యాహ్వానించు చున్నాము."

శ్లోకము యొక్క ప్రతి చరణమునందును ప్రారంభమున ప్రయోగింపబడిన క్త్వార్థక క్రియాపదముల ద్విరుక్తివలన రమ్యమైన రచనాకళ ఉట్టిపడు చున్న శ్లోకమిది. రామకృష్ణుని సేవకై సకల భువనములను ఆహ్వానించు చున్నాడనగా మన ఆధ్యాత్మికతత్త్వము ప్రపంచమునకే భిక్షపెట్టగలదనియు,

ఇది విశ్వజనీనమైన తత్త్వమునియు ఎలుగెత్తి చాటుచున్నాడనుట. "నేను భగవంతుని చూచితిని" అని చెప్పిన మహాపురుషుడు పుట్టినదేశమిది! రామకృష్ణ దట్టివాడని తాను విశ్వసించినట్లు విలియం హేస్టీవంటి విదేశీయులు నైతము జోహారు లర్పించిన పుణ్యభూమి మనది.

## వందేమాతరం గానము

నరేంద్రుడు "వందేమాతరం" జాతీయ గీతమును గానము చేసిన విషయమును గూర్చి కూడ కొంత తెలిసికొందము. బంకించంద్ర ఛటర్జీ 1875 లోనే యీ గీతమును రచించెను. ఇది 1880, 81లో వంగదర్శన్ పత్రికలో ధారావాహికముగ ప్రచురింపబడిన "ఆనందమఠం" నవలలో చేర్చబడినది. అప్పటికి నరేంద్రుడు 18, 19 సం॥ యువకుడు. "వంగదర్శన్"లో ఆ నవలను, అందలి వందేమాతరం గీతమును చదివి స్ఫూర్తిని పొందెను. అనంతకాలమున జన్మభూమిమూర్తినిగూర్చిన యాతని భావనకు ఆ గీతము ఉద్దీపన నిచ్చినది. 1884 లో అధార చంద్రసేనుని యింటిలో రామకృష్ణ బంకించంద్ర వివేకానందులు కలిసికొనిరి. వంగభాషలో "బంకిం" అనగా వంగిన యని యర్థము. రామ్కృష్ణుడు హాస్యధోరణిలో 'నిన్ను వంచినది యెవరు?' అని యడిగినప్పుడు బంకించంద్రుడు చమత్కారముగ 'బ్రిటిషువారి బూట్ల తన్నులు' అని సమాధానము చెప్పెను. ఆ సందర్భమున బంకిం రామకృష్ణుని తన యింటికి రమ్మని యాహ్వానించెను. అయన వెళ్ళజాలక నరేంద్రునితో పాటు మరొక శిష్యుని పంపెను. అప్పుడు నరేంద్రుడు బంకిం యింటినుండి "ఆనందమఠం" నవలను తెచ్చి రామకృష్ణున కిచ్చెను. రామకృష్ణుడు దానిని నరేంద్రుని ద్వారా చదివి వినిపించుకొనెను. ఈ సందర్భమున నరేంద్రుడు బకించంద్రుని కడను, రామకృష్ణుని కడను "వందేమాతరము" గీతమును పాడి వినిపించెను. ఇది విన్నప్పుడు మనకు గుండెలు పులకరించునని చెప్పుట ఏపాటిమాట! చారిత్రక కృషితో అనుశీలనము చేసినప్పుడు భారతదేశ చరిత్రలోనే యిది కావ్యత్వమును సంతరించుకొన్న తొలి దేశభక్తి గీతమని చెప్పవలెను. బంకిం వంటి మహర్షి వ్రాసిన, వివేకానందుని వంటి మహాత్ముని గళమునందు సుడులు తిరిగిన యీ మహా గీతమునకు మన ప్రభుత్వము వారి పుణ్యమా యని యీనాడు దేశమునగల ప్రతిపత్తి యెట్టిది? యని తలచుకొన్నప్పుడు గుండెలు కుదిలిపోవును. "వందేమాతరం"

ఉద్యమమునకే మంత్రమై వెలసిన ఈ గీతముచేత ప్రభావితుడైన నరేంద్రుడు చెప్పిన మాటలు కొన్ని యిట నుట్టంకింపబడుచున్నవి:

"ఇతర దేవతలను పూజించు పద్ధతికి ప్రస్తుతము స్వస్తి చెప్పి మాతృభూమిని దేవతగా భావించి ఆమె దివ్య మంగళ రూపమును మనసు నందుంచు కొని ఆమె సేవకై రానున్న ఏబది సంవత్సరములలో భారతీయులు దీక్షతో కృషి చేయవలెను.

"ఇదిగో, ఇటు చూడుడు! అది దేవుడిక్కడ తపస్సులో నున్నాడు. అదిగో, రక్తపిపాసోగ్రయైన కాళి తన పరివారగణముతో అర్చనలు స్వీకరించు చున్నది. కాని పరమశివుడు మఱల ప్రళయతాండవము చేయుచు శత్రుసంహార కారకమైన డమరుకనాదమును వినిపింపగలడు. అర్చనలు స్వీకరించుచున్న మాత మఱల ఆత్మ బలిదానములను ఆవాహన చేయగలదు.

"అదుగో, సుదీర్ఘరాత్రికి అంతిమ ఘడియ సమీపించినది. ఉదయము కాబోవుచున్నది. ఈ మన భారతభూమి యుగయుగముల నిద్ర నుండి మేల్కాంచు చున్నది. ఆమె నెవరాపగలరు? ఇక నెంతమాత్రము ఆమె నిదురపోజాలదు. ఈ భూమిపైన నే శక్తియు నామెను ఆపలేదు. ఏలయన, ఆ మహాకాళి తనకు తానే లేచి నిలుచున్నది."

జన్మభూమికి జగజ్జననికి అభేదమును అద్వైతమును ప్రకటించు నీ వాక్యములు, ఈ భావములన్నియు "వందేమాతరము" గీతము నందలి "త్వంహిదుర్గా దశప్రహరణధారిణీ" వంటి వర్ణనల ప్రతిధ్వనులే యనుట నిక్కము. భారతీయ యువకుల అస్థికల నుండి వజ్రాయుధములు తయారుకావలెనని యాతడు కంఠోక్తిగా ప్రకటించెను. జన్మభూమి కొఱకు సర్వస్వము ధారవోయగల యువకులను సమీకరించి ఒక గొప్ప సంఘటనా శక్తిని నిర్మింపవలయునని భావించి యాతడు ఎందరో యువకులను కూడదీసెను. యువకులకు ఆతడిచ్చిన పిలుపు ఎండిపోయిన ఎముకలలో క్రొత్త నెత్తురు నింపెననుట యథార్థము. ఇది బెంగాలీ యువకులపై ఎక్కువగా పనిచేసినది. ఆ పిలుపును విని కాషాయాంబర ధారులై సన్యాసులగుటకు వచ్చినవారిలో పలువురు బ్రిటిష్ ప్రభుత్వపు రహస్య శాఖయొక్క బ్లాకులిస్టులో నున్న స్వాతంత్ర సమరయోధులే యని చరిత్రకారుల

వక్కాణు. స్వాతంత్ర్యమును సంపాదించుటకు క్రమశిక్షణతో కూడిన విప్లవము జరుగవలెనని యాతడు భావించెను. 1857 విప్లవము విఫలమగుటకు సైనికుల క్రమశిక్షణారాహిత్యమేయని గ్రహించిన వివేకానందుడు యువకుల సమీకరణలో క్రమశిక్షణకు ప్రాధాన్యము నిచ్చెను. ఆతడు భారతదేశ పరిక్రమణ చేయు చున్నప్పుడు ఎందరో సంస్థానాధీశ్వరులను, జమీందారులను, తిలక్ వంటి రాజకీయ నాయకులను కలుసుకొనుటలో గల యాంతర్యమేమన వారినందరిని సంఘటిత పరుపవలెనన్న తలంపు మాత్రమే. వివేకానందుడు ఇంగ్లాండు వెళ్ళి నప్పుడు మెషిన్‌గన్ కనిపెట్టిన సర్ హెచ్. మాక్సిమ్‌ను కలుసుకొని అవసర మైనప్పుడు తనకు సహకరింపవలసినదిగా కోరినట్లు ఆయన సోదరుడు భూపేంద్ర నాథదత్త వెల్లడించినట్లు గ్రంథస్థమై యున్నది. వట్టి ఉపన్యాసములు మాత్రమే కాదు; సిద్ధాంత రచనలే గాదు; వీటితోబాటు మఠముల స్థాపన, సేవాసంస్థల నిర్వహణ; యువకుల, సన్యాసుల, రాజుల, నాయకుల, పండితుల, మహిళల సమీకరణ, దేశపరిక్రమణ, ధనసేకరణ, నిర్వహణ. ఇంతటి యద్వితీయ బహు ముఖ ప్రజ్ఞాకముగా చరిత్రను సృష్టించిన ఉద్దండలీలమైన ప్రకృతిగల మహా పురుషుడు - పూర్ణపురుషుడు వివేకానందుడు. కార్యశూరత్వమునకు పరమో దాహరణము. ఇట్టి పూర్ణ పురుషుని కొఱకు తపించి, వేచివేచి, చిక్కిన పిమ్మట జారిపోకుండ దిద్దితీర్చినవాడు రామకృష్ణుడు. ఆత్మమోక్షము కొఱకు తపించు కేవల భక్తియోగిగనో, కేవల జ్ఞానయోగిగనోగాక లోక సంగ్రహము కొఱకు అంకితమైన - భక్తి జ్ఞానయోగ గర్భిత కర్మయోగిగా నీతనిని రూపొందించెను.

## సన్యాసాశ్రమ స్వీకారము

రామకృష్ణపరమహంస 1886 అగస్టు 18 వ తేదీనాడు నిర్యాణము చెందెనని పూర్వోక్తము. అతని మరణమునకు నరేంద్రుడు మిక్కిలి విలపించెను. కొంతతేఱుకొన్న పిమ్మట తన సహచర శిష్యులతో కూడి 1886 అగస్టులోనే లారానాగోరునందు రామకృష్ణమఠమును స్థాపించెను. అనంతరము అంటపూరు నందు సహచరులతో సహా 1888 డిసెంబరు 24 వ తేదీనాడు సన్యాసమును స్వీకరించెను. వెంటనే ఉత్తర భారతయాత్ర చేసెను. తొలుత కాశీకి వెళ్లెను. పిమ్మట లక్నో, ఆగ్రా, బృందావనము, హత్రాస్, హృషీకేశ్ మొదలగు క్షేత్రములను మెట్టెను. హత్రాస్‌లో శరచ్చంద్రగుప్తను కలిసికొని యాతనిని

తన తొలి శిష్యునిగ స్వీకరించి, తన జీవిత కార్యమును గూర్చి దిఙ్మాత్రముగ వివరించెను. గాజీపూరులో పవారీ బాబాను దర్శించెను. ఇక్కడ కొంత మానసికమైన ఊగులాటకులోనై, చివరికి రామకృష్ణుడు నిర్ణేశించిన లోక సంగ్రహ కార్య నిర్వహణమునకే దీక్షబూనెను. నరేం[illegible]డైనను కింకర్తవ్యతా విమూఢుడైనప్పుడు రామకృష్ణుని దివ్యానుభూతి యాతనిని మరల త్రోవకు తెచ్చుచుండెడిది. నరేంద్రుడు తాను సాగించిన యీ తాత్కాలిక యాత్రను ముగించుకొని 1889 చివరి దశలో మరల బారానగరమునకు వచ్చి, అక్కడ కొన్ని నాళ్ళుండి 1890 లో తిరిగి విస్తృతముగ దేశపర్యటనమునకు పూనుకొనెను. రామకృష్ణుని నిర్యాణానంతరము శ్రీ శారదామాత వీరందరికి మార్గమును నిర్దేశించుచు తిన్నగ నడిపించుచుండెడిది!

## భారతదేశ పరిక్రమణ

1990 జులైలో శారదా మాత యొక్క ఆశీస్సులను, సహచర శిష్యుల యొక్క వీడ్కోలును పొందిన పిమ్మట నరేంద్రుడు భారతదేశ పరిక్రమణమునకు ప్రారంభించెను. తొలుత హిమాలయ ప్రాంతములకు వెళ్ళి అచ్చట కొన్ని నాళ్ళుండెను. అటనుండి యెన్నియో పవిత్ర క్షేత్రములను, చారిత్రిక ప్రదేశములను మెట్టెను. ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్ర, మైసూర్, కేరళ, మద్రాసు, హైదరాబాదు మొదలగు ప్రాంతములను పర్యటించెను. ఎందరో సంస్థానాధీశ్వరులను, జమీందారులను కలుసుకొనెను. వారిలో క్షేత్ర మహారాజు, ఆల్వార్ సంస్థానాధీశ్వరులు ముఖ్యులు. పూనాలో ఆనాటి జాతీయ మహా నాయకుడు తిలక్ మహారాజు యింట కొన్ని రోజులు గడిపెను. అచ్చటి నుండి బెల్గాం, బెంగుళూర్, మైసూరులకు వెళ్ళెను. ఒకవేళ స్వామి గనుక విదేశములకు వెళ్ళదలచినచో తాను అందుకు కావలసిన ఆర్థిక వనరులను సమకూర్తునని మైసూరు మహారాజు మాట యిచ్చెను. అచ్చటినుండి తిరువనంతపురము మీదుగా కన్యాకుమారికి చేరుకొనెను. ఈ యాత్రలో నాతడు తన విషయములు బయట పడనీయక ఎప్పటికప్పుడు సన్యాసి నామములను మార్చుకొనుచు ప్రచ్ఛన్నపరివ్రాజకుడై పర్యటించెను. ఎక్కడికక్కడ నాతనికి ప్రాచీన భారత వర్షము యొక్క మహావైభవము కళ్ళకు కట్టినట్లు స్ఫురించుచుండ, తన నాటి పరిస్థితులతో పోల్చుకొనుచు విషాదగ్రస్తుడయ్యెను. ఇట్లు దక్షిణేశ్వరము

నుండి బయలుదేఱిన యా మహాతేజస్వి కాంతిపుంజము కదలినట్లుగ, దివ్యదీపము తిరిగినట్లుగ నడతెంచి డిసెంబరులో కన్యాకుమారికి చేరుకొనెను!

## కన్యాకుమారి శిలపై ధ్యానము

అచ్చట అమ్మవారిని పూజించిన పిమ్మట సముద్రమును ఈదుకొనుచు పోయి తద్గర్భమున నల్లంతదూరమునగల శిలపై కూర్చుండి ఆ రాత్రంతయు నిశ్చల ధ్యానినిమగ్నుడై యుండెను. చుట్టునూ ఉల్లోలకల్లోలముగానున్న సముద్రఘోషలు, మధ్యలో బడబాగ్నివలె నాసీనుడై యున్న యీ కాషాయాంబరధారి! అప్పుడాతని హృదయ రంగమున దాదాపు మూడు సంవత్సరముల పాటు తాను చుట్టివచ్చిన మాతృవర్ష సందర్శనానుభూతి కందళించుచుండెను. సూర్యోదయ సమయమున కన్నులు తెఱచి ఉత్తరదిశయందు గల హిమగిరిని, అందలి గౌరీశంకర శిఖరమును, అందధిష్టించియున్న పరమశివుని దర్శించుచున్నాడో యన్నట్లు దృష్టిని సారించెను. ఆ విశాల నేత్రాంచలములు ఈ మధ్యలో నున్న జీవకోటులను, నదులను, మైదానములను, అరణ్యములను, పర్వతములను క్రమక్రమముగా స్పృశించుచూ దాటుకొనుచుపోయి పరమేశ్వరునిపై ప్రసరించుచుండెను. ఉన్నట్లుండి యాతనికన్నులు అశ్రుపూరితములయ్యెను. అవి మాతృవర్ష దివ్యసందర్శనానందము వలన దొరలుచున్న హర్షబాష్పములో, ఈ భూమిపుత్రుల దయనీయస్థితికి కుదిలిపోయిన గుండెలు కురియుచున్న దుఃఖ బాష్పములో ఇట్టే గుర్తుపట్టవచ్చు! ఒకవైపున మేధావుల ఆధ్యాత్మిక దారిద్ర్యము! మరొకవైపు సామాన్య ప్రజల ఆర్థిక దారిద్ర్యము! నశించుచూ నిర్వీర్యమై నిస్తేజమైన సామాజిక జీవితము కళ్ళకు కట్టినది. హృదయమాక్రోశించినది! అదుగో, ఆ రాలిపడుచున్న కన్నీటి చప్పుడు!

"భరతదేశంబు చక్కని పాడియావు,
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడసరి గొల్లవాండ్రు
పితుచుకున్నారు మూతులు బిగియగట్టి-"

అన్న శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి పద్యమిక్కడ మనకు జ్ఞాపకము రాకపోదు! ఇది 1905 ప్రాంతమున వెలువడిన పద్యమే! తెలుగు

సాహిత్యమున తొలి దేశభక్తి పద్యమిది. "హిందువులు లేగదూడలై యేడ్చుచుండ" అను వాక్యమునకు సరియైన ఉదాహరణ వివేకనందుని కన్నీరు. ఒక్క వివేకుడు ఏడ్చిన చాలును- మొత్తము హిందువులు ఏడ్చినట్లే భావింపవచ్చును. ఆనాడతడే గదా హిందువుల ప్రతినిధి! ఈ దీనస్థితిని రూపుమాపుటకాతడు కృతనిశ్చయుడయ్యెను. తిరిగి తన జన్మభూమికి పురాగౌరవమును సంతరించి పెట్టుటకు దీక్ష వహించెను. సింహమును దాని గుహలోనే హతమార్చవలయునన్న రీతిగా చికాగో నగరమున జరుగనున్న విశ్వమత మహాసభకు హాజరై, హిందూ ధర్మ ప్రాశస్త్యమును ప్రకటించి, సిద్ధాంతపరముగ విదేశీ మతములను చావుదెబ్బ కొట్టుటకు సంకల్పించుకొనెను.

## హైదరాబాదుకు ఆగమనము

నరేంద్రుడు చికాగో వెళ్ళుటకు పూర్వము 1893 ఫిబ్రవరి 10 - 17 తేదీలలో ఏడురోజులపాటు హైదరాబాదు నగరమునకు వచ్చుట ఆంధ్రప్రదేశ్ సంస్కృతి చరిత్రలో ఒక గొప్ప చారిత్రక ఘట్టమని భావింపవచ్చును. మద్రాసులోనున్న స్వామి హైదరాబాదు, సికిందరాబాదు ప్రజల కోరికపై హైదరాబాదుకు వచ్చి యెనిమిది రోజులుండి, ఎన్నియో కార్యక్రమములలో పాల్గొని, యెందరెందఱు మహనీయులనో కలుసుకొని నగరమునందలి ప్రధాన ప్రదేశములను దర్శించి తిరిగి మద్రాసుకు వెళ్ళిపోవుట ప్రత్యేకించి పేర్కొనవలసిన విషయము. ఆ సమయమున స్వామిని దర్శించుటకు వచ్చిన వారిలో రాజా శ్రీనివాసరావు బహాదుర్, నవాబ్ ఇమాద్ నవాబ్ జంగ్ బహాదుర్, సేఠ్ మోతీలాల్, మహారాజా నరేంద్రకృష్ణ బహాదుర్, మహారాజా సర్ కిషన్‌ప్రసాద్ బహాదుర్ ప్రభృతులెందరో యుండిరి. వీరందరిని స్వామికి పరిచయము చేసిన వ్యక్తి బాబూ కాళీచరణ్ బెనర్జీ. ఈతడు ఇంతకు పూర్వము కలకత్తాలో వివేకానందునికి తెలిసిన వ్యక్తి. ఈ పరిచయ కార్యక్రమమైపోయిన పిమ్మట స్వామి చార్మినార్, ఫలక్‌నుమా, నిజాం ప్యాలెస్ మొదలగు వానిని చూసెను. థియొసాఫికల్ సొసైటీ సభ్యులను, సంస్కృతధర్మ మండల్ సభాసభ్యులను కలిసికొనెను. 13 వ తేదీనాటి సాయంత్రము సికిందరాబాదు పురప్రముఖుల కోరికపై మహబూబ్ కళాశాల ఆవరణలో ఏర్పాటు చేయబడిన బహిరంగ సభలో "My mission to the west" అన్న అంశముపై ఆంగ్ల భాషలో ఉత

ప్రౌఢముగ ప్రసంగించి శ్రోతలను మంత్రముగ్ధులను చేసెను. కొంతమంది యూరోపియనులతో పాటు వెయ్యి మంది పైచిలుకు ప్రజలు వచ్చిరి. పండిట్ రతన్‌లాల్ సభకు అధ్యక్షత వహించిరి.

## వివేకానంద నామగ్రహణము

హైదరాబాదునుండి మద్రాసుకు తిరిగి వెళ్ళిన నరేంద్రుడు చికాగో ప్రయాణమునకు కావలసిన యేర్పాట్లను చేసికొనుచుండెను. ఇంతలో క్షేత్రమహారాజు అజిత్‌సింగ్‌నుండి వారికొక వర్తమానము వచ్చినది. తనకు కొడుకు పుట్టినాడనియు, నామకరణ మహోత్సవమునకు వచ్చి వెళ్ళవలసినదనియు దాని సారాంశము. స్వామి కాదనజాలక ఎట్లో తీరిక చేసికొని యచటికి వెళ్ళెను. మహారాజు ఎంతో ఆప్యాయముగ స్వాగతించి యాదరించెను. అతడు వివేకానందులకు చాల త్వరగా నేర్పడిన మిత్రుడేగాక మిక్కిలి అప్తుడైన శిష్యులలో నొకడుగూడ. చికాగో వెళ్ళుటకు కావలసిన వసరులను సమకూర్చి పెట్టుదునని స్వామికి మాటయిచ్చిన మహారాజతడు. బొంబాయిలో స్వామికి వీడ్కోలు చెప్పుటకు తన యాంతరంగిక కార్యదర్శినిగూడ నచటికి పంపెను. ఈ క్షేత్ర పట్టణమున మహారాజు యింటనే ఆతని కోరికపై స్వామి వివేకానంద నామమును స్వీకరించెను. ఇది 1893 మే నెలలో జరిగిన విశేషము. శ్రీ శంకర భగవత్పాదులవారి "వివేక చూడామణి" గ్రంథనామమందలి వివేక శబ్దమే స్వామి యొక్క వివేకానంద నామమునకు మూలము. అప్పటివఱకు వివిధ నామములలో వ్యవహరింపబడుచూ ప్రచ్ఛన్నముగ భారతదేశ పరిక్రమణము చేసిన స్వామి అది మొదలుకొని వివేకానంద నామముతో జగత్ప్రసిద్ధుడయ్యెను. చికాగో మత మహాసభలో గుప్పుమని గుబాళించిన యీ పేరు లోగడ పూనాలో తన యింట తనతో పాటు కొన్ని రోజులు గడపిన వ్యక్తికిగల యీ పేరును పోల్చుకొని తిలక్‌వంటి మహనీయుడు సైతము 'ఈతడా వివేకానందుడు!' అని ఆశ్చర్యచకితుడయ్యెను!

## చికాగో విశ్వమత మహాసభ

స్వామీ వివేకానంద చైనా జపాన్ కెనడాల మీదుగా ప్రయాణించి, 1893 జూలైనెల మధ్యలో చికాగో చేరుకొనెను. విశ్వమత మహాసభ సెప్టెంబరులోగాని

జరుగదని తెలిసికొని కొంత నిరుత్సాహపడెను. 1893 ఆగస్టులో అన్నిస్క్వాంలో హార్వర్డు విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ రైట్‌ను కలుసుకొని పరిచయ పత్రమును సంపాదించుకొని మత మహాసభలో పాల్గొనగలిగెను. ఈ మహాసభలు 1893 సెప్టెంబరు 11 నుండి 27 వరకు జరిగినవి. వివేకానందుడు 11, 15, 19, 20, 26, 27 తేదీలలో మొత్తము ఆరు ప్రసంగములు చేసెను. ఈ సభలు విశాలమైన ఆర్టు ఇన్స్టిట్యూట్‌లో జరిగినవి. ప్రపంచము నలుమూలలనుండియు దాదాపు అన్ని ముఖ్య మతములవారును కలిసి యేడు వేల మంది ప్రతినిధులుండిరి. వివేకానందుడు హిందూమత ప్రతినిధిగా పాల్గొనెను. ఇతణ్ణి యీ దేశం పంపలేదు; ఆ దేశం పిలువలేదు. కొద్దిమంది మిత్రుల సహాయ సహకారములతో తనకుతానై చేసిన లంఘన యిది. "స్వయమేవ మృగేంద్రతా" అన్న మాటకు సార్థక్యమిది. తొలినాటి తొలి సభలో సభానిర్వాహకులు ఆయనను ప్రసంగింపుమని కోరినప్పుడు తొలుత వివేకానందుడే రెండు మూడు పర్యాయములు వాయిదా వేయించెను. చివరికి ఆయనవంతు వచ్చినది. హిందూ సంస్కృతి యందలి పరిత్యాగమునకు చిహ్నమైన, శరీరబద్ధమగు చతుర్థాశ్రమమువోలెనున్న స్వామి ప్రసంగించుటకు వేదికపై నిలబడినప్పుడు భారతదేశమే నడచివచ్చి సాక్షాత్కరించుచున్నదో యన్నట్లుండెను. ఉన్నట్లుండి "ఓ అమెరికా సోదరీ సోదరులారా!" అన్న మధురము, శాంతము, విశ్వమానవ సౌభ్రాత్ర ప్రతిపాదకము అగు భారతీయ ఋషివాక్యం ధ్వనించింది. ఒక్కసారి పంచభూతములు స్తంభించి, వెంటనే పులకరించినవి. నింగీ నేలా తాళము వేసినట్లు రెండు నిముషములు హర్షధ్వానములు మార్మోగినవి. అప్పుడాతడు చేసిన భారతీయ శుభ ధర్మగానముతో విశ్వ గోళము చకితమయ్యెను!

## చికాగో నగరోపన్యాసముల విశేషములు

అది 1893 సెప్టెంబరు 11వ తేది. ఆనాడు మొదటి ఉపన్యాసము జరిగెను. "ఓ అమెరికా సోదరీ సోదరులారా!" అన్న సంబోధనకు పిమ్మట చేసిన ప్రసంగము ఐదు నిముషములకు పరిమితమైన మిక్కిలి చిన్న ప్రసంగము. సమస్త మతములకును, సమస్త ధర్మములకును తల్లి యగు సనాతన ధర్మము పేర అతడా ఉపన్యాసము నిచ్చెను. సహనమును, సర్వమత సత్యత్వమును లోకమునకు బోధించిన సనాతన ధర్మము నాది అని సగర్వముగా ప్రకటించెను.

సర్వ మతములు సత్యములని మేము నమ్మెదము అని ప్రకటించి, హిందూ ధర్మము యొక్క విశ్వజనీనతను వివరించెను. మానవ సమాజము యొక్క అభి వృద్ధిని అరికట్టిన మూర్ఖత్వమును, హింసాప్రవృత్తిని ఖండించెను. పుష్పదంతుడు అను గంధర్వకవి సంస్కృతమున రచించిన "శివమహిమ్నస్తోత్రము" నందలి ఏడవ శ్లోకము యొక్క భావమును - శ్లోకము చదువలేదుగాని - అ భావమును మాత్రము ఇట్లు వివరించెను:" వివిధ ప్రదేశములలో బుట్టిన నదులు సముద్రమున సంగమించునట్లే వివిధారాధనామార్గములు వక్రములై కనబ్బట్టినను, అవక్రములై కనబ్బట్టినను సర్వేశ్వరా! నిన్నే ప్రాపింపజేయుచున్నవి " (దీనికి మూలశ్లోకమిది:- "రుచీనాం వైచిత్ర్యాదృజు కుటిల నానాపథ జుషామ్ నృణామేకోగమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ".) ఇది తాను బాల్యమునుండియు పారాయణ చేయుచున్న స్తోత్రమనియు, మన దేశమున కోట్లకొలది మానవులు పారాయణ చేయుదురనియు కూడ చెప్పెను.

అట్లే భగవద్గీతయందలి నాల్గవ అధ్యాయములోని 11 శ్లోక భావమును శ్లోకము చదువకుండ - భావమును మాత్రమే యిట్లు నివరించెను :- "ఎవరు ఏ రూపమున నన్ను గ్రహింతురో నేను వారినట్లే యనుగ్రహించుచున్నాను. ఎల్లవారును సమస్త మార్గములచేతను తుదకు నన్నే ప్రాపించుచున్నారు." (దీనికి మూల శ్లోకము, "మేయథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్. మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.") ఈ విధముగ పాశ్చాత్యులకు భగవ ద్గీతను తొలుత పరిచయము చేసిన ఘనత వివేకానందునకే దక్కుచున్నదని చెప్పవచ్చును. ఈ ఉపన్యాసమునందలి ఒక్కొక వాక్యమును ఆతడు ఉదాత్త - అనుదాత్త - స్వరిత భేదములతో రమణీయమైన నాటకీయశైలిని గర్భీకరించి ప్రతిపాదించుచున్నప్పుడు శ్రోతల ఉత్కంఠ ఒక్కొక్క మెట్టుగ పైకిపోవుచు వరద పొంగుచున్నట్లు క్రమక్రమముగ ఉత్తాలమగుచు ఒక్కుమ్మడి పొర్లి సమ్మోహితులైన తీరు మహాశ్చర్యజనకము! మహావక్తృత్వకళకు పరాకాష్ఠయగు మహోపన్యాసమిది.

అది 1893 సెప్టెంబరు 15 వ తేదీ . ఆనాడు రెండవ ఉపన్యాసము జరిగినది. ఇది ఉపన్యాసము కాదు; మిక్కిలి చిన్నకథ. మొదటి ఉపన్యాసమును విని సమ్మోహితులైన శ్రోతలు మఱల స్పృహలోనికి వచ్చుటకు కొంత వ్యవ

ధానము కావలెను కాబోలు, మూడు రోజుల వ్యవధితో ఇది యేర్పాటు చేయబడి నది. చిన్నపిల్లలను బుజ్జగించుచు కథ చెప్పినట్లు "ఇప్పుడు మీకొక చిన్నకథ చెప్పెదను'' అను ఎత్తుగడతో ప్రారంభమై, సంభాషణా శిల్ప రమణీయముగ సుడులు తిరిగి ముగియును. ఆయా మతముల భేదాభిప్రాయములకు సంకుచిత మగు నాలోచనా విధానమే కారణమని హెచ్చరించి నూతిలోని కప్ప సముద్రపు కప్పతో పోటీపడిన విధమును వివరించిన తీరు వ్యంగ్య వైభవముతో నొప్పారు చున్నది. విశాల హిందూ సమాజము యొక్క విశ్వజనీనతను భంగ్యంతరముగ ప్రతిపాదించిన తీరు అమృతావహము! "నూతియందలికప్ప పురుగులనుండియు, క్రిములనుండియు నీటిని శుభ్రమొనర్చుచు....కాలము గడుపుచుండ క్రమముగా అది కొంత బలిసినది'' వంటి వాక్యముల అంతరార్థము ఇట్టే స్ఫురించి 'ఔరా! వ్యంగ్యవైభవ'మనిపించును! వివేకుడు చెప్పిన చిన్న కథలు శిల్పరమణీయములు. అన్నింటికీ యిది తలమానికమైన కథ!

అది 1893 సెప్టెంబరు 19 వ తేది: ఆనాడు మూడవ ఉపన్యాసము జరిగినది. "హిందూ ధర్మ ప్రకాశిని" అన్న పేరుతో (Paper on Hinduism) ముందే వ్రాసిన ప్రసంగ మిట ప్రస్తుతీకరించబడినది. ఇది సుదీర్ఘమైన ప్రసంగము. భగవద్గీత - బ్రహ్మసూత్రములు - ఉపనిషత్తులు వీటి యొక్క సారాంశము బొట్లుబొట్లుగ పిండినట్లు మన వేదాంత తత్వమును వివరించిన ప్రసంగమిది. మానవుని పాపియని చెప్పుటకంటె మహా పాపము మఱియొకటి లేదు. ఆత డమృతపుత్రుడు. ప్రకృతి కాత డధీనుడు కాడు. ప్రకృతి యాతని దాసురాలు. భౌతిక శాస్త్ర దృష్టితో జూచినను, ఏకత్వమే - అద్వైతమే - సిద్ధాంతమని నిశ్చయింపనగును. ఆత్మ నిత్యశుద్ధము, జననమరణాతీతము, అద్వితీయము. భేదములన్నియు కేవల మజ్ఞానముచే గోచరించుచున్నవి - ఇత్యాది విషయములు పొందికగా ప్రతిపాదింపబడినవి. వేద ప్రామాణ్యమును నొక్కి చెప్పుట ఇందలి మరొక ముఖ్యాంశము.

1893 సెప్టెంబరు 20 వ తేది: హిందూ దేశమునకు పాశ్చాత్య దేశముల నుండి కావలసినది ఆధ్యాత్మిక విషయములు కావు; ఆర్థిక సాహాయ్యము అన్నది యీ ప్రసంగ సారాంశము. 1893 సెప్టెంబరు 26 వ తేదీనాడు హిందూ ధర్మ సాఫల్యమే బౌద్ధధర్మమని వక్కాణించెను. హిందూ ధర్మమున కర్మ

కాండ, జ్ఞానకాండ అని రెండు భాగములు. జ్ఞానకాండమున జాతి వర్ణభేదములు లేవు. మతపరముగ వర్ణవ్యవస్థ లేదు. వర్ణవ్యవస్థ కేవలము సాంఘిక వ్యవస్థ - వంటి విషయములు వివరింపబడినవి. భారతదేశమున బుద్ధుడు అవతార మూర్తిగా పూజింపబడుచున్నను ఇక్కడ ఆ మతము పుడిదిపెట్టుకొని పోవుటకు గల కారణమును గూర్చి యాతడు చర్చించిన విధము ఆలోచనాత్మకము. వేద ప్రామాణ్యము నంగీకరింపకపోవుట, భగవంతుని యునికిని గూర్చి తటస్థముగ నుండుట ఇందుకు కారణములని యాతని తీర్పు.

1893 సెప్టెంబరు, 27వ తేదీనాటిది చివరి సభ. ఇందు 'సామరస్యము' గూర్చి చక్కగా ప్రసంగించెను. విశ్వమత మహాసభ దిగ్విజయముగ నిర్వహింపబడినందులకు ధన్యవాదములు సమర్పించి, వలయునది కలహము కాదు, సహకారము, అన్యమత ధ్వంసము కాదు, తదాశయ గ్రహణము; శత్రుత్వము గాదు, శాంతియుత సమన్వయము అని ప్రతిపాదించెను. ఈ చివరి ఉపన్యాసము చేయునపుడు మధ్యలో ఒక నిముష మాగి "హిందువుల వేద వేదాంతములను గూర్చి చదివి, వారి మతమును గూర్చి స్వతంత్ర జ్ఞానమును బడసినవారు మీలో నెందరు గలరు; చేతులెత్తుడు" అని ప్రశ్నించెను. ఏడువేల మంది ప్రతినిధులతో కూడిన యా సభనుండి ముగ్గురు నల్గురు మాత్రమే చేతు లెత్తిరి. అప్పుడు వివేకుడు అనుశయపూర్వకముగా 'ఇట్టి స్థితిలోనా మీరు మమ్ము గూర్చి విమర్శకు పూనుకొనుట!" యని మందలించెను. వారందరు సిగ్గుతో తలదించుకొనిరి.

చివరి యుపన్యాసము సందలి యాతడు పలికిన మొదటి వాక్యమిది : "ప్రపంచ మత మహాసభ చరితార్థత నందినది." వాస్తవమునకు ఈ చరితార్థత అక్కడ మ్రోగిన హిందూ విజయ దుందుభికే దక్కుచున్నదిగాని తక్కిన మతముల వారికిగాదు. అసలీ సభ క్రైస్తవ మతముయొక్క గొప్పతనమును చాటుటకు నేర్పాటు చేయబడినది. కాని తానొకటి తలచిన దైవమొకటి తలచినట్లు అక్కడ హిందూ ధర్మమునకు పట్టాభిషేకము జరిగినది. ఆ సభ నిర్వాహకులే యిది కంఠోక్తిగా నంగీకరించిరి. ఈ యారు ఉపన్యాసములలో గాని మటి యితర ఉపన్యాసములలోగాని వివేకానందుడుగ్గడించినది హిందూ ధర్మము యొక్క ప్రాశస్త్యమును గూర్చియు, దాని విశ్వజనీనతను గూర్చియు

మాత్రమే. హిందూ ధర్మమునే విశ్వధర్మముగా పరిగణింపవలయునని యాతడు చేసిన సూచన గమనార్హము. అదియే యాతడాశించిన విశ్వధర్మము!

## మహావక్తృత్వ కళ

''ఈశ్వర ప్రేరిత మహావక్త'' ''హైందవ ఝంఝూ మారుతము'' ''వేదాంతి శిరోభూషణము' ఇత్యాదిగా - ఆ విశ్వమత మహాసభల తరువాత - అతడందుకొన్న ప్రశంసలను గూర్చి వర్ణింప నెవరి తరము! వక్తృత్వము, వక్తృత్వకళ, మహా వక్తృత్వము, మహావక్తృత్వ కళ - మొదలగు పారిభాషిక పదముల తరతమ భావములను మించిన మహావక్తృత్వ కళ యాతనిది. హిందూ తత్వమునకు సంబంధించిన సర్వవిషయములను వివిధ దృక్పథములతో ఇన్ని వేలమంది ప్రపంచ మేధావులకు, ఆంగ్లభాషా మహాసాగరమున గజయీతగాడై యింత వివరముగా నందించిన కారణజన్ముడు వివేకానందుడు. ఈ మహావక్తను ఆ మహావక్తయగు శ్రీకృష్ణునితో మాత్రమే పోల్చవలయును.

అల కౌరవ సభలో శ్రీకృష్ణుడు, యిల విశ్వమత మహాసభలో శ్రీవివేకుడు యిద్దరే మనకు వక్తలు - మహావక్తలు, మహోదాత్త మహావక్తలు. ఒకరు పీతాంబరధరుడు; శిఖిపింఛ శోభిత కిరీటధారి, మరొకరు కాషాయాంబరధరుడు, రమణీయ ఉష్ణీష కిరీటధారి. ఇరువురును లోకోత్తర సుందర విగ్రహ మేఘ శ్యాములే. సభ్యులు పోరిపోరి కన్నులు చేపుకొనుచు అమృతంబానినయట్లుగ వారిని చూచి చూచి తన్మయులగుచున్నారు. అరుగో, ఆ మహావేదికాగ్రముల నుండి జలద స్వనగంభీరత వెలుగొప్పగ సలరు చెవుల నఖిల జనంబులు విన, జడ చేతనములు చకితమౌనట్లు సంబోధించుచున్నారు. ఒకరు సారపుధర్మమునకు విమల సత్యమునకు అవనతి కలిగినప్పుడు ధర్మవిస్తారకమయ్యు సత్య శుభ దాయకమయ్యును దైవముండెడిన్ అని హెచ్చరించుచుండ, మరొకరు హిందూ ధర్మము విశ్వధర్మ మనియు అది జగత్కల్యాణ కారణమనియు సంబోధించు చున్నారు. అచట కూర్చున్న మహామహులెల్లరు పురుషోత్తముడింత యొప్ప బల్కనె, మరుమాటలాడనయకోవిదుడెవ్వరు? ఇందను వరి యెవ్వరంచు విస్తు పోవుచున్నారు. ఇచ్చట కూర్చున మహానుభావులెల్లరూ శ్రీ వివేకుడింత యొప్ప బల్కనె, మఱుమాటలాడ మతకోవిదుడెవరు? ఇందను వరి యెవ్వరంచు సిగ్గుతో తల దించుకొనుచున్నారు. అదుగో శ్రీకృష్ణుని విశ్వరూప సాక్షాత్కారము!

ఇదుగో శ్రీ వివేకానందుల విశ్వధర్మ సాక్షాత్కారము! నేలా నింగీ తాళము వేయుచున్న చప్పుడు, పంచభూతములు పులకించి, పరిమళించి పరవశించుచున్న వైనము, శ్రీకృష్ణుడు గీతోపదేశముచేసి, మానవ ధర్మమును మరింత కట్టుదిట్ట మొనర్చినట్లు, విశ్వజనీన హిందూ ధర్మమునకు మరింత గట్టి పునాదులు వేసిన విశ్వమానవుడు, విశ్వయోగి, విశ్వకవి, విశ్వవక్త వివేకానందుడు!

## అమెరికా సోదరీ సోదరులకు కృతజ్ఞతలు

వివేకానందుడు అమెరికాలో ప్రవేశించిన పిమ్మట తొలుత నెన్నియో కష్టములు పడెను. అప్పుడాతనికి అమెరికా స్త్రీలు ఎంతో సహాయపడిరి. ఆ విషయమును తలచుకొని యాతడు "అమెరికా మాతలారా! నూఱు జన్మలెత్తినను మీ యెడ నా కృతజ్ఞతా ఋణమును తీర్చుకొనజాలను. ప్రాచ్యుల అతిశయోక్తియే ప్రాచ్యుల కృతజ్ఞతాతిశయమును దెలుపజాలును. హిందూమహాసముద్రమే సిరాయును, మహోన్నత హిమాలయపర్వతమే లేఖినియు, భూతలమే కాగితమును, కాలమే లేఖకుడునై యున్నను మీయెడ నా కృతజ్ఞతను వెల్లడింపజాలవు" అని వ్రాసెను. ఈ భావమునకు మూలము పుష్పదంతుడు వ్రాసిన "శివమహిమ్న స్తోత్రము''లోని యీ క్రింది శ్లోకము ఆధారము:

''అసితగిరి సమంస్యాత్ కజ్జలం సింధుపాత్రే
సురతరువరశాఖాలేఖినీ - పత్రముర్వీ
లిఖతి యదిగృహీత్వా శారదా సర్వకాలం
తదపి తవగుణానామీశ పారంనయాతి" (32వ శ్లోకము)

"ఈశ్వరా! సముద్రమనెడు సిరాబుడ్డియందు కాటుకకొండతో సమానముగా సిరా యుండుగాక, కల్పవృక్షపుకొమ్మ కలమగుగాక, భూమి కాగితమగుగాక, వాటిని తీసికొని సాక్షాత్తు సరస్వతియే శాశ్వతముగా వ్రాసినను నీ గుణములు తగ్గిపోవుట యన్నది ఉండదు." అనగా నీ గుణములను ఉచితరీతిని వర్ణింపజాలదు అని యర్థము. ఈ మూలభావమును ఆధారము చేసికొని వివేకానందుడు భారతదేశమును వర్ణించినతీరు పరమ రమణీయము. ఇది ఆయన ఊహాపోహలకును, పాండిత్యమునకును సంకేతమగుటయేగాక వారు చేయు ప్రతి యాలోచన దేశభక్తికి సమన్వితమైయుండునన్న విషయము మనకు స్ఫూర్తిదాయకము!

## జె. జె. గుడ్విన్ స్మృతి గీతాంజలి

అది మొదలుకొని వివేకానందుని యుపన్యాసములకు పాశ్చాత్యదేశముల యందు గిరాకీ పెరిగెను. 1895 ఆగస్టు వరకు అమెరికాలోనే పలుతావులందు ఉపన్యాసపరంపరను గుప్పించెను. వేదాంత సొసైటీని స్థాపించి పాశ్చాత్యులకు తరగతులను నిర్వహించెను. రాజయోగమును గూర్చిన గ్రంథమును రచించెను. 1895 అక్టోబరు, నవంబరు నెలలలో లండన్ నగరంలో ఉపన్యాసములనిచ్చెను. అవి జ్ఞానయోగము అను పేర పుస్తకముగ వెలసినవి. పిమ్మట అమెరికాకు తిరిగి వెళ్ళి, 1896 ఏప్రిల్, మే నెలలో రెండవసారి ఇంగ్లాండులో పర్యటించెను. ఆక్స్ఫర్డులో మాక్సుముల్లర్‌ను కలిసికొనెను సాయణాచార్యుడే మఱల మాక్సుముల్లరుగ నవతరించెనను అభిప్రాయమును ప్రకటించెను. ఈ పర్యటనలలో అమెరికాలోగాని, ఇంగ్లాండులోగాని యాతడు ఎందరో పాశ్చాత్య శిష్యులను సంపాదించుకొనెను. వారిలో న్యూయార్కుకు చెందిన జె. జె. గుడ్విన్ ఒకరు. ఈతడు వివేకానందునకు స్టెనోగ్రాఫరుగా పనిచేసి, వారి యుపన్యాసముల నన్నింటినీ జాగ్రత్తగా లోకమున కందించిన మహనీయుడు. వివేకానందునితో పాటు హిందూదేశమునకు వచ్చి, ఉదకమండలములో స్థిరపడి, 28 ఏళ్ళ వయస్సులోనే మరణించిన యువకుడు. ఇది వివేకానందునకు పిడుగుపాటయ్యెను. ఇక తాను బహిరంగ సభలలో నుపన్యసించు కాలము గతించినదని విచారించెను. ఒక కవితను వ్రాసి - ఎలిజీ - గుడ్విన్ తల్లికి పంపించెను. ఆమె వితంతువు :

### REQUIESCAT IN PACE

Speed forth, O soul ! upon thy star - strewn path,
Speed, blissful one! where thought is ever free,
Where time and space no longer mist the view,
Eternal peace and blessings be with thee!
Thy service true complete thy sacrifice,
Thy home the heart of love transcendent find,
Rememberance sweet, that kills all space and time
Like altar rosses fill thy place behind !
Thy bonds are broken, thy quest in bliss is found,

And one with That which comes as Death and Life,
Thou helpful one! unselfish e'er on earth,
A head! still help with love this world of strife!

"హే ఆత్మన్! వేగముగా సాగిపొమ్ము. దివ్యకాంతి పూతంబగు పథము నందు పయనింపుము. ఆనందపూర్ణమా! ఏ తాపమునకు తావులేని ధామమునకు తరలిపొమ్ము. దేశకాల మానములని అడ్డుతెరలు వేయలేని ఆ లోకము చేరు మింక. శాశ్వతమౌ ఆనందము, శాంతి యచట లభియించును. నీ చేసిన సేవలకిక సాఫల్యము సమకూరును. నీ తావును నీ తల్లిని పరమాత్ముడు కరుణించును. మధురములౌ నిను గూర్చిన స్మృతులవ్వియె మట్టుపెట్టు దేశకాల మానమ్ముల. ఆ స్మృతులే అర్పిత పుష్పములై నీవిడిచిన తావునింక నింపివేయు చింతదీఱ. బంధనములు తెగిపోయెను. తహతహలకు తనివిదీర లభియించును ఆనందము. సాయపడిన స్నేహితుడా! స్వార్థరహిత మానవుడా! సాగిపొమ్ము ముందుకింక. ఇక ముందును సాయపడుము మాపైగల ప్రేమతోడ. చదలుపట్టు లోకమ్మిది. సాయపడుము సహచరుడా!"

సుప్రసిద్ధులయిన ఇంగ్లీషు కవులనేకులు వ్రాసిన ఎలిజీలకు సాటివచ్చు ఎలిజీ యిది యనుటలో సందేహ మేమియులేదు. ఈ కవితను వివేకుడు 1998 జూన్‌లో గుడ్విన్ మరణించిన వెంటనే అల్మోరానుండి పంపించెను.

## భగినీ నివేదిత ఆగమనము

మన దేశములో స్థిరపడిన వివేకానందుని విదేశీ శిష్యులలో అతిముఖ్యురాలైన మరొక మహనీయురాలు సోదరి నివేదిత. ఈమె అసలు పేరు మార్గరెట్ నోబుల్. ఐరిష్‌వనిత. లండన్‌లో వివేకానందుని ఉపన్యాసములను విని ముగ్ధురాలై, భారతీయ ధర్మసంస్కృతులచేత ప్రభావితురాలై మనదేశమునకు వచ్చి వివేకానందుని విద్యా విధానమున కనుగుణముగ విద్యాలయములను స్థాపించి స్త్రీ విద్యకై విశేషించి కృషిచేసిన మహిళ. ఇక్కడే స్థిరపడి మరణించిన మహనీయురాలు ఈమెకు డార్జిలింగులో నొకస్మారక చిహ్నము గలదు. సోదరి నివేదితగా ప్రసిద్ధికెక్కిన యీమె భారతీయులకు ప్రాతఃస్మరణీయురాలు. భారతదేశములో స్థిరపడి సేవజేయుటకు నిశ్చయించుకొన్న పిమ్మట మార్గదర్శ

కర్తవ్యము చేయవలసినదని కోరుచూ వివేకుని యాశీస్సుల నడిగినది. అప్పుడాయన 1900 సెప్టెంబరు 22 నాడు వ్రాసిన లేఖలో "Benediction" అన్న పేరుతో వ్రాసిన యీ కవిత సేవాలక్షణములను సూచించుచూ ప్రఖరమైన దేశభక్తి పూరితముగ నుండి స్ఫూర్తిదాయకమైనది:

### A BENEDICTION

The mother's heart, the hero's will
The sweetness of the southern breeze,
The sacred charm and strength that dwell
On Aryan altars, flaming, free;
All these be yours, and many more
No ancient soul could dream before—
Be thou to India's future son
The mistress, servant; friend in one.

భారత మాతృహృదయమును, ఇచటి వీరుల ఆత్మశక్తిని ఆవాహనచేసి కొని ఇచట వీచు మలయ మారుతముల మధురిమలను ఆస్వాదించుచు ఈ ఆర్య పీఠాలపై వెలుగొందుతున్న మహా పురుషుల ఆత్మజ్యోతుల కాంతులలో స్ఫూర్తిని పొందుచూ స్నేహితురాలుగా సేవకురాలుగా సర్వలక్షణములను సంతరించుకొని యీ దేశమునకు సేవచేయుమని చెప్పిన ఒక దివ్యమైన దేశభక్తి కవిత యిది.

## రామకృష్ణ మిషన్ స్థాపన

ఇట్లు పాశ్చాత్య దేశములలో తానుచేసిన హైందవ శుభధర్మ గానముతో మొత్తము ప్రపంచమునే చకితమొనర్చి స్వదేశమునకు తిరిగివచ్చుచు వివేకానందుడు 1897 జనవరి 15 నాడు కొలంబో చేరుకొనెను. 1897 ఫిబ్రవరి 15 నాడు మద్రాసులో మకాము చేసెను. 1897 మేలో కలకత్తాలో శ్రీ రామకృష్ణ మిషన్ సేవా సంస్థను నలకొల్పెను. 1898 డిసెంబరులో బేలూరుమఠ సమర్పణ గావించెను. 1899 మార్చి 19 నాడు మాయావతిలో అద్వైతాశ్రమమును స్థాపించెను. "కొలంబో - ఆల్మోరా" అన్న పేరుతో వెలువడిన యాతని యుపన్యాసములు మిక్కిలి ప్రసిద్ధి గాంచినవి. 26-8-1899 నుండి 26-5-1900 వఱకు

అమెరికాలో రెండవసారి పర్యటించెను 1900 అగస్ట్ - అక్టోబరు నెలలలో పారిస్‌లో జరిగిన సర్వమత చరిత్రల సమావేశములో పాల్గొనెను. అదే సమయమున అక్కడ జరిగిన ప్రపంచ విజ్ఞాన శాస్త్రవేత్తల సమావేశములో పాల్గొనుటకు జగదీస్ చంద్రబోసు కూడ వెళ్ళెను. అక్కడ వారిద్దరూ కలిసికొనుట రమణీయమైన సన్నివేశము. 1900 సం॥ అక్టోబరు - నవంబరు నెలలలో వియన్నా, కాన్‌స్టాంటినోపిల్, కైరోలలో పర్యటించెను. 1901 మార్చిలో స్వదేశమునకు తిరిగి వచ్చి మూడవసారి ఉత్తర భారత యాత్ర చేసెను. అప్పుడనేక దివ్యక్షేత్రములను దర్శించెను. తల్లి భువనేశ్వరీదేవి కోరికపై ఆమెను వెంట తీసికొని అస్సాములోని కామాఖ్యాక్షేత్రమును దర్శించెను. తనవారికనుచూ వివేకానందుడు చేసిన కార్యములు బహుశః ఇట్టివే ఒకటి రెండుండ వచ్చునేమో! జగద్గురు శ్రీ శంకరపీఠముల నమూనాలో ఆతడు స్థాపించిన రామకృష్ణ మఠములు, రామకృష్ణ మిషన్లు ఒక గొప్ప వ్యవస్థయని చెప్పవచ్చును.

## వ్యక్తి వివేక విశేషములు

శ్రీ వివేకానందుడు 1902 జులై 4 వ తేదీనాడు బేలూరు మఠమున మహాసమాధి నొందెను. అయన జీవించిన మొత్తము 39½ సం॥ స్వల్పకాలములో సాధించిన ఘన విజయములను గూర్చి వర్ణించుట యెవరి తరము? ఈ విషయమున నీతడు శ్రీ జగద్గురు శంకరుల వారసుడు. శంకరుడు మరీ 32 సం॥లకే దేహము చాలించిరి. శంకరుల అపరావతారమే వివేకానందులు. బుద్ధుని కరుణా హృదయమును శంకరుల మేధాసంపత్తిని తనలో సమన్వయించుకొని యవతరించిన మహాపురుషుడు వివేకానందుడు. ఈ ముఘ్వురి చరిత్రను పరిశీలించి చూచినచో ఇంకనూ ఎన్నో లక్షణములు బుద్ధునివి కొన్ని శంకరులవి కొన్ని యీతనిలో సమన్వయ పడినట్లు కాన్పించును. భారత దేశ చరిత్రకు సంస్కృతికి విశ్వవ్యాప్తిని సంతరించి పెట్టిన మహనీయులు ఈ ముగ్గురే. ఆశ్చర్యమేమన యీ ముగ్గురూ చాలా అందమైనవారు. భారతదేశములో మిక్కిలి అందమైన సుప్రసిద్ధ మహాపురుషులెవరు అంటే- యీ ముగ్గురేయని వెంటనే చెప్పవచ్చును. వీరి పేర్లు విన్నంతనే ఒక తేజస్సు మనకళ్ళ ముందు నడయాడుతుంది. ఇక తత్త్వమును గూర్చి యాలోచించినప్పుడు బుద్ధుడు ఈ జాతిని తన బోధల ద్వారా సమ్మోహిత మొనర్చెను. శంకరులు సంజీవిత మొనర్చెను. వివేకానందుడు

ఈ రెండునూ చేసెను. అందుకే వివేకుణ్ణి గూర్చి యాలోచించినప్పుడు మన యాలోచనల కూకటి వ్రేళ్ళు బుద్ధుని దగ్గఱ తన్నిపెట్టగలవు. వివేకుడన్నాడు గదా, తాను భారతదేశమునకు రాబోవు 1500 వందల సం॥లకు సరిపడు సిద్ధాంతములను ఇచ్చి పోవుచున్నానని! అనగా వివేకానందుని చరిత్రకు పూర్వ రంగము బుద్ధుడు వఱకు 2500 సం॥ ఉత్తర రంగము రాబోవు 1500 సంవత్సరములు. అనగా మొత్తం నాలుగువేల సంవత్సరముల చరిత్రయే వివేకానందుని చరిత్ర యన్నమాట. ఇట్టిదీ వివేకానందులవారి వ్యక్తిత్వము!

సిద్ధాంత రూపముననున్న అద్వైత వేదాంతమును సామాన్య మానవ జీవిత స్థాయికి కొనివచ్చి అద్భుతముగ సమన్వయించి, జీవుడే శివుడు అన్న సత్యమును అనుభూతికి తెచ్చిన విశిష్ట ప్రక్రియ వివేకునిది. అతడు చెప్పని విషయము లేదు. చికాగో ఉపన్యాసములలో హిందూధర్మమే సెక్యులర్ ధర్మమని ప్రతిపాదించిన వాడీతడు. సెక్యులర్ అన్న మాటను ఉపయోగింపకపోయినను అచ్చమగు సెక్యులరిజమునకు కుహనా సెక్యులరిజమునకు భేదమును ఘంటాపథముగ చెప్పినవాడీతడు. సోషలిజము, సోషలిష్టు అను మాటలను భారతీయులకు తొలుత వినిపించుటయేగాక అది అర్థరహిత వ్యవస్థయని యానాడే యాతడు చేసిన నిష్కర్ష యిటీవలి కాలమున రుజువగుట గమనార్హము. నేటి మన రాజకీయ వ్యవస్థలో "మానవ వనరులు" అన్నమాట వినబడుచున్నది. దాని మూలకములన్నియు మనకు వివేకానందుని వాఙ్మయములోనే లభింపగలవు.

## మహాకవిత్వ సంపద

ఇప్పటి వఱకు చేసిన పరామర్శనుబట్టి స్వామీ వివేకానంద భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనమునకు వేగుచుక్క, భారతాద్వైతమూర్తి, వేదాంతి, విశ్వయోగి, మానవతావాది, దేశభక్తుడు, మహావక్త ఇత్యాది విషయములు సాక్షాత్కరించినవి. వీటికి తోడు అతడు మహాకవిగూడ. ఆయన ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, సంస్కృతభాషలలో గొప్ప కవితలను వెలయించిన మహనీయుడు. ఇవి రాశిలో కొన్ని మాత్రమే అయినా వానిలో చాలా గొప్పవి. జాతీయభావన, విశ్వమానవతా దృక్పథము, ఆధ్యాత్మిక తత్త్వము అనునవి యీ కవితలలో గోచరించు సామాన్య లక్షణములు. సంస్కృతమునకు సంబంధించి వారు వ్రాసిన కవితలు మొత్తము 26 శ్లోకములు మాత్రమే యిప్పటికి

లభించినవి. ఇవి "అంబాస్తోత్రమ్" "శివస్తోత్రమ్ "రామకృష్ణస్తోత్రమ్", "రామకృష్ణస్తుతి" అనునవి.

అంబా స్తోత్రమునందు మొత్తము ఏడు శ్లోకములు గలవు. వీని రచనా కాలము తెలియదు. సర్వ మత మహాసభలో పాల్గొనుటకు చికాగో వెళ్ళుటకు పూర్వము కన్యాకుమారి శిలపై ధ్యాననిమగ్నుడై కూర్చుని యనిర్వాచ్యమగు నొకానొక ప్రేరణతో వ్రాసియుండవచ్చునని భావింపవచ్చును. కాని కచ్చితముగ చెప్పలేము. శివస్తోత్రమునందు మొత్తము ఆరు శ్లోకములున్నవి. వీని రచనా కాలము కూడ కచ్చితముగా తెలియదు. అంబాస్తోత్రము రచించిన పిమ్మట కావచ్చును. రామకృష్ణ స్తోత్రమునందును, రామకృష్ణ స్తుతియందును కలిసి మొత్తము పదమూడు శ్లోకములున్నవి. ఇవి 1894 సెప్టెంబరులో నాలుగు, 1898 ఫిబ్రవరి- నవంబరు నెలలలో తొమ్మిది వ్రాయబడినవి. ఈ శ్లోకము లన్నియు నాతని యుపన్యాసములో నక్కడక్కడ పొందుపరుపబడినవి. వీటి యందలి భావసంపదగాని, శబ్ద ప్రయోగ నైపుణ్యముగాని మిక్కిలి రమణీయములు. వివేకానందుని యాంగ్ల రచనలను మూడు తరగతులుగా విభజింపవచ్చును. ఒకటి: ఉపన్యాసములు, రెండు: లేఖావళి, మూడు: కవితాఖండికలు. మఱల నీ కవితా ఖండికలను రెండు తెఱగులుగా విభజింపవచ్చును. ఒకటి: Original Poems. రెండు: Translations. ఇవి వారు సంస్కృత వాఙ్మయమునుండియు, హిందీ సాహిత్యమునుండియు కొన్నింటిని ఎంపిక చేసికొని అనువదించిన ఖండికలు. వివేకానందుని ప్రోజంతయు పొయిట్రీవలె నుండునను విషయము మఱువరాదు. ఈ ఆంగ్ల కవితా ఖండికలలో దాదాపు ఇరవైయైదు ఖండికలు Originals, సుమారు ఇరువది ఖండికలు Translations. ఈ వ్యాసమున వారు వ్రాసిన అయిదు సంస్కృత శ్లోకములను, రెండు ఆంగ్ల కవితలను ఉదాహరించితిని గావున విస్తరభీతిచే మఱికొన్నియుదాహరించుటలేదు. వివేకుడు 1902 జులై 4వ తేదీన దివంగతుడయ్యెను. అప్పటివఱకు ఆంగ్ల భాషలో దాదాపు అసలే కవిత్వము వ్రాయని రవీంద్రుడు తానిదివఱకు బెంగాలీలో వ్రాసిన గీతాంజలిని ఇంగ్లీషులో ప్రోజులో అనువదించుటకు ప్రారంభించి, 1906, 7 నాటికి పూర్తిచేసెను. దానికి 1913లో నోబెల్ బహుమతి లభించినది. దీనికి కారణము రవీంద్రుడు వస్తుతః మహాకవి యగుటయేగాక అప్పటివఱకు వివేకానందుడు తన ఉపన్యాసముల ద్వారాను, కవితల ద్వారాను

అమెరికా ఖండమునందును, యూరోపు ఖండమునందును సృష్టించిన భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతి వాతావరణమే యని భావింపనచ్చును.

వివేకానందునకు దాదాపు సమకాలీనులై, యాతడు మరణించిన పిమ్మట కూడ చిరకాలము జీవించిన మన మహాపురుషులలో ముఖ్యముగ పేర్కొన వలసిన మహనీయులు నలుగురున్నారు తిలక్, రవీంద్ర, అరవింద, రామ తీర్థలు. తిలక్ వివేకుల కలయికను గూర్చియు, రవీంద్ర వివేకుల కలయికను గూర్చియు రేఖా మాత్రముగ పూర్వోక్తము. వివేకానందుడు దివంగతుడైన పిమ్మట మూడు సంవత్సరములకు వందేమాతరం ద్వారా స్వాతంత్ర్యోద్యమము విజృంభించినదనియు, ఈ విజృంభణకు వివేకుని బోధలే కారణమనియు, ఆ తరువాత ఆ యుద్యమమును ముందుకు తీసుకొని వెళ్ళినవ్యక్తి ఆయన యువ స్నేహితుడు అరవిందఘోష్ అనియు, ఆతడు వివేకానందుని బుద్ధిసంపదకు నిజమైన వారసుడనియు రోమారోలా చెప్పిన సంగతి యింతకు ముందొకచోట ప్రస్తావింపబడినది. అరవిందుడు జైలులో నున్నప్పుడు యోగసాధన చేయు చున్న సమయమున తనను వివేకానందుడు పరిశీలించుచున్నట్లు అనిపించినదట. ఆతని వాణి తనకు వినిపించేదట. తాను ప్రతిపాదించిన "అతిమానస" "అతి మానవ" సిద్ధాంతమునకు స్ఫూర్తిదాత వివేకానందుడే అంటారు అరవిందులు. ఇంకను ఇట్లనెను:- "Be hold, Vivekananda still lives in the soul of his motherland - and in the souls of her children." ఎంత గొప్ప మాట యిది!

## సంక్షిప్త భారత స్వరూపుడు

ఒక సందర్భమున వివేకానందుడు తనను గూర్చి తాను "A Condensed India" అని ప్రకటించుట జరిగినది. అనగా సంక్షిప్త భారత స్వరూపుడు అని యర్థము. ఇందులో అతిశయోక్తి లేదు. ఈ సంక్షిప్త భారతదేశమును గూర్చి బాగుగా నధ్యయనము చేసినచో భారతదేశము చక్కగా నర్థమగును. వాల్మీకి రామాయణములో మొదటి వంద శ్లోకములు సంక్షేప రామాయణ మున్నది. దీనినే బాలరామాయణమందురు. దీనికి పెంపుదలగా తరువాత ఇరవై నాలుగువేల శ్లోకముల పెద్ద రామాయణమది. ముందు బాలరామాయణమును చదివినచో పిమ్మట పెద్దరామాయణము బాగుగా నర్థము కాగలదు. అట్లే

వివేకానందుని జీవితచరిత్ర. ఆతని ఉపన్యాసములను, తదితర వాఙ్మయమును పూర్తిగా చదివినచో వేల సంవత్సరముల భారతదేశ చరిత్ర, సంస్కృతి, ధర్మము బాగుగా నర్థము కాగలవు. మహాపురుషుల జీవితచరిత్రయే దేశచరిత్ర అని వివేకానందుడొకచోట పేర్కొనెను. ఒక్క వివేకానందుడు చాలు మనకు ఈ దేశము అర్థమగుటకు! ఆ విధముగ ఎన్నియో విషయములు చెప్పినాడు వివేకుడు. "సంక్షిప్త భారతము" అను శబ్దబింబము యొక్క పరమార్థమును ఆలోచింపవలసి యున్నది. వివేకుడు మన ప్రాచీన భారతవర్షమునకు సంబంధించిన ఆర్ష సంప్రదాయమును, సంస్కృతిని, ధర్మమును, ఆధ్యాత్మిక తత్త్వమును యథాతథముగ చెక్కుచెదరనీయక, వన్నె తఱుగనీయక భద్రముగా మనకందించినాడు. నా సిద్ధాంతమిది యని క్రొత్త పంథాను వీరియు త్రేవడీయ లేదు. ఏ ప్రాచీన గ్రంథమునకుగాని "నా ఉద్దేశ్యమిది" యనుచు అన్యథీకరించి భాష్యములు వెలయించలేదు దేనినిగాని ఖండించలేదు. దేనికిగాని మార్పులు, చేర్పులు, కూర్పులు, తీసివేతలు చెప్పలేదు. ప్రతి సమస్యకు పరిష్కారము మన దగ్గఱే యున్నదని చెప్పెను. ఈ జాతియొక్క ఆత్మను సరిగ్గా అర్థము చేసికొన్న మహాపురుషుడు వివేకానందుడు!

స్వామీ వివేకానంద 1897 నవంబరులో లాహోరు నగరమునకు వచ్చినప్పుడు స్వామీ రామతీర్థ యాతనిని దర్శించి యుపన్యాసములను విని ఆ యన ర్గళ వాగ్ధాటికి ఆశ్చర్య చకితుడయ్యెను. వివేకానందునితో ననేక వేదాంత విషయములను చర్చించి సందేహములను తీర్చుకొనెను. అప్పుడు వారిద్దరికి కుదిరిన స్నేహము వర్ణనాతీతము. అనంతరము వివేకుని సంక్షిప్తభారత స్వరూప కల్పనకు వ్యాఖ్యాన ప్రాయముగ ఒకానొక స్ఫూర్తితో రామతీర్థ భారతదేశమునకు తనకు అద్వైతమును ప్రకటించుచు వర్ణించిన మహావాక్యములివి: "అఖండ భారతమే నేను. భారత వర్షమే నా శరీరము. కన్యాకుమార్యగ్రమే నా పాదభూమి. హిమాలయమే నా శిరము. గంగా సింధు బ్రహ్మపుత్రా నదులు నా శిరము నుండియే ప్రవహించుచున్నవి. కోరమాండలు మలబారులు నా పాదద్వయము. ప్రాక్పశ్చిమములే నా రెండు చేతులు. ఈ నా రెండు చేతులను చాచి విశ్వమానవకోటిని కౌగలించుకొందును. దీనికై యనంతాకాశము నిరీక్షించుచున్నది. నేను నడచినచో భారతమే నడచినట్లుండును. నేనూపిరి పీల్చుచో భారతమే యూపిరి పీల్చును. నేను మాటలాడిన భారతమే మాటలాడినట్లుండును. నేనే భారతము. భారతమే

నేను. నేనే శంకరుడను. నేనే సర్వేశ్వరుడను.'' - ఈ నా రెండు చేతులను చాచి విశ్వమానవకోటిని కౌగలించుకొందును- అను వాక్యము హిందూధర్మము యొక్క విశ్వజనీనతను చాటుచున్నది. వివేకానంద, రామతీర్థులు మరొక గురు శిష్యుల జంట.

సామాన్య ప్రజానీకమును తట్టిలేపిన మొదటి మహనీయుడు వివేకానందుడు. ఈతడు వారి కష్టములకు, అజ్ఞానమునకు పరిష్కారమేమిటియని వేదనపడిన మొదటివ్యక్తి. ఆకలితో నలమటించు వానికి మతముకాదు ముఖ్యము- తిండి, బట్ట అని యెలుగెత్తి చాటిన ఉద్దండుడు.

''నా దేశమున నొక్క కుక్కయైనను పస్తుపడి యున్నంతవఱకు దానికాహారమిచ్చి రక్షించుటయే నా పరమధర్మము. ఇదియే నా మతము. తద్భిన్నమంతయు నధర్మము, కృత్రిమ ధర్మము.''

''సమస్త జీవస్వరూపుని, అద్వితీయుని....విశేషము.... నా యార్త నారాయణుని, నా దీననారాయణుని,.... సమస్త దేశీయులకెల్ల పేదయగు నా భారత నారాయణుని, నా యిష్ట దేవత నర్చించుటకై యెన్ని జన్మలైనను నెత్తెదను గాక, ఎన్ని వేల బాధలనైననూ అనుభవింతునుగాక!'' అని యాతడు ప్రకటించిన తీరు సందేశాత్మకము!

భారతదేశమును తెలిసికొనుట యనగా ఒకవైపు నాధ్యాత్మిక తత్త్వమును, మఱియొకవైపు సామాన్య ప్రజాహృదయమును తెలిసికొనుటయని వివేకానందుని యుద్దేశ్యము.

తలపాగ హిమకిరీటముగను, నడుమును బిగించినకట్టు వింధ్యగిరిగను, నిలువునా జీరాడు అంగరఖాతో గూడిన చీలమండలము కన్యాకుమార్యగ్రముగను కాన్పించు వివేకుడు భారతాద్వైతమూర్తి. సంక్షిప్త భారతము. అతని జీవితమందలి ప్రతి యంశమూ మనకు సందేశమును ప్రసాదించునట్టి యంశమే. ప్రతి మాటయు మనకు సందేశాత్మకమే. అతడు సెలవిచ్చిన యీ క్రింది యంశములు మనకు స్ఫూర్తిదాయకములు; ఆచరణీయములు.

# సందేశము

"ధన్యమైన పుణ్యభూమి అనిపించుకొనగల యోగ్యతయు, అర్హతయు ఏ భూమికైనను ఉన్నచో, కర్మానుభవమునకు ఈ ప్రపంచమందలి యాత్మలు అవతరింపవలసిన భూమి యనునది ఏదైననూ ఉన్నచో, పరమాత్మను చేరుటకై పోవుచున్న ప్రతి యాత్మకు చిట్టచివరి మజలీయైన భూమి యనునది ఒకటి యున్నచో, మహోన్నతమైన సౌజన్యము, ఉదారత, పావనత, ప్రశాంతత - అన్నిటికిని మించి ఆధ్యాత్మికత, అంతర్వీక్షణముల మానవాళికి అందించిన మహత్తరమైన భూమి యనునది యీ విశ్వములో నొకటి యున్నచో - అది భారత భూమి యని గుర్తింపవలయును."

"భారత వర్షమే నశించినచో ప్రపంచమున ఆధ్యాత్మికతయే నశింపగలదు. నైతిక సమగ్రత పూర్తిగా లుప్తము కాగలదు. మధురము, ఆత్మికమునగు ధర్మానుభూతి నశింపగలదు. ఆదర్శవాదము నశించును. వీటికి బదులు కామ భోగములే స్త్రీ పురుషులకు దైవములు కాగలవు. ధనమే వీటికి పురోహితుడు. వంచన, బలత్కారము - వీటికి పూజలు. మానవాత్మయే బలి కాగలదు. అది జరుగరాదు."

"మన రాష్ట్రాత్మ. మన ధర్మములో నున్నది. ఈ ధర్మమును ఎవ్వరును విధ్వంస మొనర్పజాల నందుననే హిందూ రాష్ట్రము ఇన్ని ఆఘాతములను తట్టుకొని యింకనూ సజీవముగ నిలిచియున్నది. దానిని రక్షించుకొనుటయే మన కర్తవ్యము".

"విశాలహృదయులైన వందలకొలది పురుషులు, స్త్రీలు జీవిత సుఖములను అనుభవింపవలయును కోరికలనుత్యజించి దీనత్వములో, అజ్ఞానములో కూరుకొనిపోవుచున్న కోట్ల కొలది మన దేశీయుల సంక్షేమమునకై తపించినపుడు మాత్రమే హిందూ దేశము జాగృతము కాగలదు."

"హిందూ అను శబ్దమును వినుటతోడనే నీలో విద్యుత్తుల్యమగు మహత్తర శక్తి భావము కలిగినప్పుడే నీవు నిజమైన హైందవుడవు."

"ఓ! భారత వర్షమా! నీ సతీత్వమునకు ఆదర్శము సీత, సావిత్రి, దమయంతి అను మాటను విస్మరింపకుము నీవు మాతృవేదికపై సమర్పణగా అవతరించినావను మాట విస్మరింపకుము. అనంత జగన్మాతృత్వమునకు నీ సమాజ విధానము ప్రతిబింబ మనేమాట విస్మరింపకుము."

"నాయనలారా! కావలసినది యినుప కండలు, ఉక్కు నరములు వజ్ర కఠోరమైన మనసు, శక్తి, పౌరుషము, క్షాత్ర వీర్యము - బ్రహ్మతేజము - అని గ్రహింపుడు."

"ఈ దేశపు నిరుపేద దళిత ప్రజాకోటి హృదయముల నుండి స్రవించు రక్తముతో పెంచబడి, విద్యాబుద్ధులు గడించి, వారిని గూర్చి తలవనైనను తలవని ప్రతి వ్యక్తియు నొక దేశ ద్రోహియే."

"ఈ దేశమున పుట్టిన ప్రతి వ్యక్తియు తాను పుట్టినదేతదవు- 'నా జీవితము ఈ దేవసేవకు అంకితమైనది.' అని తెలిసికొనవలసి యున్నది".

## హెచ్చరిక

వివేకానందుడిచ్చిన సందేశములతోపాటు ఆతడు చేసిన హెచ్చరికలను గూడ మనము శిరసావహింపవలసియున్నది. 1898 లో ఆతడు చేసిన అతి ముఖ్యమైన హెచ్చరికయిది :

"If and when The British leave India. There is every posibility of China's invading India." "ఒకవేళ బ్రిటిషువారు భారత దేశమును విడిచి పెట్టి వెళ్ళినను, చైనావారు మనపైకి దండెత్తి రాగల అవకాశము పుష్కలముగా నున్నది సుమా!" వివేకానందుడు చికాగో వెళ్ళి వచ్చునప్పుడు చైనా, జపాన్‌లమీదుగా ప్రయాణము సాగించెను. అప్పుడు చైనా జాతి యొక్క మనస్తత్వమును గ్రహించి యాతడు చేసిన హెచ్చరికయిది. ఆయన చెప్పినట్లే జరిగినది. 1962 అక్టోబరులో చైనా మనదేశముపైకి రానే వచ్చినది. మన దేశమునకు చెందిన పదునాలుగువేల చదరపుమైళ్ళ వైశాల్యముగల భూభాగమును ఆక్రమించి కూర్చున్నది. ఆనాటి జాతీయ శక్తులు ఎంత చెప్పిననూ వినక అప్పటి కేంద్రప్రభుత్వము పెడచెవిని పెట్టి తగు జాగ్రత్తలు తీసికొనక పోవుట వలన ఇట్లు జరిగినది. అదొక విషాద చరిత్ర. ఎప్పటికైననూ మనము

ఆ భూభాగమును తిరిగి పొందవలసి యున్నది. దీనికితోడు కాశ్మీరు సమస్యల వంటి సమస్యలు మనకెన్నో ఉన్నవి. వీటిని మనము ఒక పిసరు కూడ నష్ట పోకుండ పరిష్కరించుకొనవలసి యున్నది. అందుకొఅకు వివేకానందుడు ప్రబో ధించిన ప్రఖరమైన దేశభక్తితో, ధైర్యముతో పయనింపవలసి యున్నది.

వివేకానందుని ఉపన్యాసముల నన్నింటిసారమును వడగట్టినచో, ఒకే దేశము, ఒకే ప్రజ, ఒకే సంస్కృతి, ధార్మిక రాజ్యము - అన్న లక్ష్యములను ఆతడు మనముందుంచినట్లు స్పష్టపడగలదు. ఈ లక్ష్యములను సాధించుటయే యిప్పటి మన కర్తవ్యము. అప్పుడే ఆ మహాద్రష్ట కన్నకలలు సఫలములై మన యదృష్టము పండగలదు.

## మంగళాశాసన వచనములు

"అదిగో, సుదీర్ఘ దిశకు అంతిమఘడియ వచ్చినది. ఉదయము కాబోవు చున్నది. ఈ మన భారతభూమి యుగయుగముల నిద్రనుండి మేల్కొనుచున్నది. ఆమె నెవరాపగలరు? ఇక నామె యెంత మాత్రము నిద్రపోదు. ఈ భూమి మీద ఏ శక్తి ఆమెను ఆపలేదు. ఏలయన, అదుగో! ఆ మహాకాళి తనకుతానే లేచి కూర్చున్నది''

"అదుగో! మన ప్రాచీన మాతృదేవి మఱల మేల్కాంచి పునరుద్ధరింప బడిన సింహాసనముపై మున్నెన్నడూ లేనంత మహావైభవముతో ఆశీనురాలై యున్న దృశ్యము నా కళ్ళముందు స్పష్టముగా కాన్పించుచున్నది. శాంతిశుభ కామనాస్వరముతో ఆమె వైభవమునే విశ్వమెల్ల మార్మోగింపగలరు'' వంటి మంగళాశాసన వాక్యములు సార్థకములు కాగలవు.

ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్ని బోధత!

# ఆధునిక జీవితము –
# అనుష్ఠాన వేదాంతము

—వాకాటి పాండురంగారావు

‘ఆధునికము’ అంటే మనం వుంటున్న ఈ ఇరవయ్యవ శతాబ్దపు ఆఖరి దశకం అనీ-

‘అనుష్ఠానం’ అంటే పుస్తకాల్లో, ప్రసంగాల్లో కాకుండా మన దైనందిన జీవితంలో ఆచరించడమనీ - చెప్పుకోవాలి.

‘వేదాంతం’ అంటే సృష్ట్యాదిని మనిషన్నవాడు పుట్టగానే, ఇంకా మనసు కలుషితము కాకపూర్వమే తన ఆత్మ పరమాత్మ అనే అసలు చైతన్యం తాలూకు సౌగంధాన్ని కోల్పోకముందలి ఆ తాజా స్థితిలో, ఆ జ్ఞానోషోదయ వేళ అనుభవించి, మాటలలోకి అనువదించి, అందించిన సారాంశం. (అదే వేదాంతం) - ఇటీవలి కాలంలో బూజుపట్టి, కంపుకొట్టి, దూరమవుతున్న వేళ ‘సంభవామి యుగే యుగే’ అన్నమాట అబద్ధము కాదుసుమా అని నూట ఇరవై యొకటవ సారో. మూడువందల ఎనభయ్యవసారిగానో మన మధ్య మనవలె మనలో ఒకడుగా తిరిగిన వివేకానందుడనే వెలుగు కిరణం, బూజుకర్ర, మాటల కుఠారం - ఎవ్విధంబున మనకు నేడు పనికివచ్చును అన్నది అసలు ప్రశ్న.

అసలు ‘వేదాంతం’ అనేసరికే అదేదో గడ్డాలవాళ్ళు, జందెప్పోగులవాళ్ళు, రిటైరయినవాళ్ళు, ఇంకేమీ వ్యాపకాలు లేని సోమరులు - వీళ్ళకు మాత్రమే పనికి వచ్చేది అని చాలామంది మోహన్లు, సుశీలలు అపార్థం చేసుకుంటుంటారు. అది తప్పున్నర, ప్లస్ తప్పున్నర.

‘అమ్మా, నీ లోలోపల ఇంకో ‘మనిషి’ దాక్కుని వుంది. నువ్వు తెలిసి తెలిసి దారి తప్పునప్పుడల్లా చెర్నాకోలవలె చెళ్ళు మంటుంటుంది. దానికీ నీకు

మధ్య ఒద్దిక వుండాలి. లేకపోతే చాల సమస్యలు వస్తాయి' - ఈ మాట పనికి రానిదెవరికి?

'నాయనా! ఎన్నో దేశా లుంటాయి. ఎన్నో భాష లుంటాయి. ఎన్నో పూజా విధానాలుంటాయి. కాని అందరము ఒక్కటే కుటుంబం; సమానంగా కూచుని ఒకటిగా ఆలోచించండి. హాయిగా నిండానూరేళ్ళు బతకండి. ఏ పని చేసినా 'ఎఫిషియెంటు'గా 'ఎక్సలెంట్'గా చేయి. ఒక్కసారి ఫలితం ఆశించి నట్లుగా వుంటుంది. ఒక్కసారి వుండదు. కాని దానిని గురించి పట్టించుకో నీ చేతనయినంత బాగా పని చేయడంలోనే నువ్వు ఎదుగుతావు. అదే నీకు ఫలం. అంతేకాదు. సర్వ సంపదలు, విశ్వమంతటా నిండివున్న వనరులు నీ ఒక్కడి సొత్తు కాదు, అవి అందరివీ, అందరికీ తండ్రి అయిన ఆ ఈశ్వరుడివి. అనుభ వించు. సంపాదించు. అందరికీపంచు. అనురాగం పందిరికింద నీకు అప్పజెప్పిన పనులను నిండు మనసుతో చేయి—' అన్న హితవు ఏ వయసు వారికి, ఏ రాజ కీయ పార్టీ వారికి ?

"అది రాయి అనుకుంటున్నావా, ఇది చెట్టు అని పిలుస్తున్నావా, అవి నీళ్ళు కదూ, దానికి నువ్వు పెట్టుకున్న పేరు ఇనుముకదూ— వాటన్నిటిలోను నేనే వున్నాను" అన్న ఆనాటి వాని పేరు భగవంతుడయితే, అదేమాట చెబుతున్న నేటి జ్ఞానం పేరు సైన్సు. మరిప్పుడు చెప్పండి - ఈ మంచి మాటలను భూగోళం పేనిన తాళ్ళతో బంధించగలమా, కాలం అనే జల్లెడ కన్నాలతో కట్టి పడేయ గలమా?

—వీలులేదు. వేదాంతం సర్వ కాలాలలో సర్వ మానవాళికి పుట్టినప్పటి నుంచి గిట్టిన తర్వాతదశలో కూడా ఆలోచనకు వచ్చే అనంతమైన జ్ఞాన, విజ్ఞాన కోశం.

* * *

పాశ్చాత్య విద్యా ప్రభావితుడు, చాదస్తాలు లేనివాడు, నిశితంగా ఆలోచించే వాడు, కవి యంత ఆవేశం కలవాడు జవహర్లాలు నెహ్రూ.

హరిశ్చంద్రుడి చరిత్రనుండి కింగ్‌జార్జిరాక ఎరిగినవాడు, సత్యానికి ధర్మానికి తావులేని రాజకీయాలు లేవు అని నమ్మి, ఆచరించి విజయం సాధించినవాడు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ.

కత్తికి కత్తి, దెబ్బకు దెబ్బ - అన్న ధీర దేశభక్తుడు నేతాజీ సుభాసు చంద్రబోసు.

రాజకీయాల ఒడినుండి రాసలీలాలోలుడి ఒడిలోకి గెంతిన యోగీశ్వరుడు అరవింద ఘోషు.

'విశ్వమంతా విభుని మందిరమైతే వీధి వాకిలేదే సోదరీ!' అని బెంగాలీలో పాడిన విశ్వకవి రవీంద్రుడు.

వీరందరినీ ఉత్తేజపరచినవాడు వివేకానందుడు - అంటే ఆయన ఎంతటి వాడో కొద్దిగా అర్థమవుతుంది.

ఆయన అమెరికాలో, అమెరికా వాళ్ళ చెవులు మెలివేస్తూ పలికిన పలుకులు నేడు వాడవాడలా విన్పిస్తున్నాయి అంటే - ఆయన వాణి నిత్యనూతనం అని స్పష్టమవుతుంది.

గతితార్కిక భౌతికవాదము, మార్క్సునుంచి అరుణోదయమూ అంటూ విప్లవగీతిక లాలపించిన వామపక్ష మిత్రులు అతితాజాగా తమ పల్లకీలోకి ఎక్కించుకుని ఊరేగిస్తున్న సద్గురువు వివేకానందుడు అంటే ఆ వెలుగు నిత్యం అని మందబుద్ధుల బుర్రలో సైతం మెరుపులు మెరుస్తాయి.

శంకరుడి తర్వాత శంకరుడి వంటి వాడయిన వివేకానందుడు - నరేంద్రుడిగా రామకృష్ణ పరమహంసను మొదటిసారిగా కలిసినప్పుడు - 'మీరు దేవుడిని చూచారా?' అని అడిగిన ప్రశ్న వుందే - అది నేటి వస్తునిష్ఠాయుగంలో ప్రతి యువకుడు, యువతి అడిగే ప్రశ్నే!

"మతాన్ని సైన్సు వలె పరీక్షలకు, ప్రయోగాలకు గురిచేయాలా అని నన్నడిగితే చేయాలి అనే అంటాను. అట్లాటి పరీక్షలకు నిలబడని దానివి తీసి విసిరి పారేయాలి. ఆ పరీక్షల తర్వాత మిగిలిన 'మతం' వుందే అది సైన్సు బలంతోకూడిన మతం అవుతుంది." అని డంకా బజాయించిన వేదాంత వాది పరమహంస గారి ప్రియశిష్యుడు.

వేదాంతానికి వలెనే ఆయన గూడా నేలవిడిచి సాము చేయలేదు.

"నా తల్లి భరతమాత ప్రపంచానికి భిక్షపెట్టని రంగ మసలు లేదు" అని గర్వంగా చెప్పుకున్న జాతిసారథి యాతడు.

**విజ్ఞానం** ఇచ్చిన చేతులతో విశ్వాంతరాళమంతటా చేతులు విస్తరించిన నేటి మానవుడు సాటి మానవుడి కన్నీటిని తుడిచివేయలేకుండా వున్నాడు. జరారోగభయాలను నిర్జించిన నేటి మానవుడు అణ్వాస్త్రభయంతో వణుకు తున్నాడు. ఒక గింజ పండినచోట వంద గింజలు పండించగల్గిన నేటి ప్రపంచంలో అనుక్షణము ఆకలితో వేలాది ప్రజలు మరణిస్తూనే వున్నారు. పరమాణు గర్భాన్ని పరిశీలించిన మానవుడు, ప్రపంచం మూగ వేదనను అర్థం చేసుకో లేకుండా వున్నాడు. సరిహద్దులు చెరిపివేస్తున్న సైన్సు దీపం క్రింద నిలబడిన ఆధునికుడి మనసునిండా అమావాస్యలే!

ఈ విచిత్రమయిన సంకటంనుండి బయట పడడానికి వివేకానంద బోధ నామృతాన్ని మించిన రసాయనం వేరొకటిలేదు.

ప్రపంచానికి వెలుగునివ్వగలది భారతీయులే! కాని వాళ్ళు తమకుతాముగా సృష్టించుకొన్న చాదస్తాలనుండి, మౌఢ్యాలనుండి బయటకు రావాలి అని గర్జించా డాయన.

## మతం : మౌఢ్యం

''**హిందూ** సమాజాన్ని బాగుపరచాలి. అంటే మతాన్ని ధ్వంసం చేయ నక్కరలేదు. ఇవాళ ఈ సమాజం ఇట్లా వుంది అంటే దానికి కారణం మతం కాదు, మతాన్ని సమాజానికి ఎట్లా అన్వయించాలో అట్లా మనం అన్వయించక పోవడమే.

—గంటను ఎడమ చేతిలో పట్టుకోవాలా, కుడిచేత్తోనా, గంధాన్ని నుదుట మాత్రమే ధరించాలా కాదా, హారతిని రెండుసార్లు తిప్పాలా, నాలుగుసార్లా - అని రాత్రింబవళ్లు చర్చించేవాళ్ళు జడులు, మూర్ఖులు.

''బంగాళదుంపకు వంకాయ తగిలితే ప్రళయం ఎంత కాలంలో వస్తుంది? మట్టి రుద్దుకుని పదిసార్లు చేతులను కడుక్కోకపోతే, నరకానికి పోయేది పధ్నా లుగు తరాలా, ఇరవైనాలుగు తరాలా? ఒకవేపు కోట్లాదిమంది ఆకలితో అలమటిస్తుంటే ఇంకొకవైపు ఇటువంటి ప్రశ్నలకు సమాధానాలు అన్వేషిస్తు న్నారు మనవాళ్ళు.

"మూఢాచారాలను విసర్జించండి, మూఢనమ్మకాలను విడనాడండి అటువంటి వాటిలో వున్న ఆస్తికత్వంకన్న మీరు నాస్తికులయితే మంచిది." ఈ వివరణ చదివాక కూడా ఎవరన్నా మతం మత్తుమందు అనగలరా?

"పేదవారు, నిరక్షరాస్యులు, అజ్ఞానులు - వారే మీ దేవుళ్ళు, వారి సేవకు మించిన మతంలేదు'' అన్న వివేకానందుడు మార్క్సుకన్న ముందర అసలు సమస్యను గుర్తించాడు. సంఘర్షణ హింస కాకుండా త్యాగాలతో కూడిన సేవా భావాన్ని ఆయన సూచించాడు. 'వర్గసంఘర్షణ' అన్నది అశాస్త్రీయము అని ప్రముఖ కమ్యూనిస్టుపార్టీ నేత పెకింగ్ సమావేశంలో 1992 లో ఘోషించిన తర్వాత పేదవారి అభ్యున్నతికి వివేకానందస్వామి సూత్రం ఎంత సమకాలీనమో తెలిసివస్తుంది. అంతేకాదు, సమాజంలో ఒక భాగం ఇంత నికృష్టమైన స్థాయికి ఎందుకు దిగజారింది అన్న విషయంమీద స్వామీజీ మాటలు కటువుగా, నిర్ద్వంద్వంగా వుంటాయి. అవధరించండి!

"భారత దేశంలోని అగ్ర జాతులారా! మీరు నోటితో మీమీ గొప్పలు చెప్పుకోవచ్చుగాని మీరు జీవచ్ఛవాలు. మీ పద్ధతులు, ఆచారాలు చనిపోయిన నిన్నటివి. ఈ ప్రపంచమే 'మాయ' అయితే అందులోని అసలయిన మాయా మూర్తులు మీరే! మీరు గాలిలో కలిసిపోతే నవభారతం ఆవిర్భవిస్తుంది.

'రైతు గుడిసె నుంచి, జాలరి గూడెం నుంచి, చర్మకారుడింటి నుండి, పాకీవాడి కొంపనుండి, దుకాణాల నుండి, కర్మాగారాల నుండి, అడవుల నుండి, కొండల నుండి, తోపుల నుండి నవభారతం ఉదయిస్తుంది. వారిని మేల్కొల్పండి. వారికి ఒక్కపూట అన్నం పెట్టండి. వారు ప్రపంచాన్నే మార్చివేయగలరు."అన్న ఆయన శంఖారావం దేశంలోని ఇటీవలి సామాజిక రాజకీయ పరిణామాలను ఎంత సరిగా అంచనా వేసిందో అని ఆశ్చర్యం కలుగుతుంది.

ఆ నవ భారతానికి నాందిగా ప్రతి భారతీయుడూ ఒక సింహంగా, వజ్ర సంకల్ప చిత్తుడుగా కావాలని ఆయన సూచించాడు. అనాటి ఇంగ్లీషు వారి విద్య (ఆ మాటకొస్తే నేటి విద్య ఇంకా దారుణం) ఇట్లాంటి వ్యక్తుల్ని తయారు చేయలేదు అంటూ స్వామి వివేకానంద ఇట్లా చెప్పాడు:

"మీకు ఇప్పుడు లభిస్తున్న విద్యలో కొన్ని మంచి అంశాలున్నాయి. కాని అది మిమ్మల్ని ఒక మనిషిగా తయారు చేయడం లేదు. అది తద్విరుద్ధమైన ప్రభావాన్ని చూపిస్తూంది.

"పాఠశాలలో పిల్లవాడు చేరగానే వాడికి మొట్ట మొదట చెప్పేది ఏమిటి - 'మీ నాన్న మూర్ఖుడు; మీ తాత వెర్రివాడు; మీ ఆచార్యులు అబద్ధాల పుట్టలు; మీ పవిత్ర గ్రంథాలన్నీ చెత్తకుండీలు.' ఈ విధమైన బోధనతో - పదహారవ ఏడు వచ్చేసరికి అతడి మనసులో నిర్వీర్యత, నిస్సహాయత, అధైర్యం నిండి వుంటాయి.

"విద్య అంటే నీలో దాగివున్న పరిపూర్ణతను వెలికి తెచ్చేది. మతం అంటే నీలోని దేవుడిని సాక్షాత్కారింప చేసేది.

—"సన్యాసులు పల్లె పల్లెకు వెళ్ళి చదువు నేర్పించాలి."

ఈ విధంగా సన్యాసి అనేవాడు సమాజ ఉద్ధరణ కెట్లా కృషి చేయాలో ఆయన చెప్పిన దానిని కొలమానంగా తీసుకుంటే భక్తుల దాతల సేవలు విరాళాలు స్వీకరిస్తూ, అనుభవిస్తూ, సుఖంగా సోమరి జీవితాన్ని గడిపే 'సన్యాసుల' నయితే వారిని ఎంత దూరంగా వుంచాలో అర్థమవుతుంది. ఆధ్యాత్మికత అన్నది కూడా బజారులో అమ్మే వస్తువు కాదు. నేడు ఈ స్పష్టమైన అవగాహన చాల చాల అవసరం కాదా?

పురుషులతో బాటు స్త్రీలకు విద్య నేర్పాలి. సమానావకాశాలు కల్పించాలి అని, అట్లా విద్య ద్వారా మనసు వికసించిన స్త్రీ తన అభ్యుదయ మార్గాన్ని తాను నిర్దేశించుకోగలదనీ చెబుతూ ఆయన—

"స్త్రీలకు చదువు నేర్పండి మొదట. ఆ తర్వాత వారిమానాన వారిని వదలివేయండి. అప్పుడు వారికి ఏమికావాలో ఏమివద్దో స్త్రీలే చెబుతారు. వారి తరపున మాట్లాడడానికి మీరెవ్వరు?

"స్త్రీలు ముందుకు అడుగువేయాలి. లేకపోతే మూర్ఖులుగా మిగిలిపోతారు. నిరంకుశులయిన భర్తల చేతిలో జీవచ్ఛవాలుగా మిగిలిపోతారు.

"ఇట్లా నిరంకుశుడయిన భర్త, నిరక్షరకుక్షి అయిన భార్య - వీరికి పుట్టిన బిడ్డ బానిసకాక మరేమవుతాడు?" అంటాడు. కాని ఈ విషయంలో ఆయన పాశ్చాత్య నాగరికత ధోరణులను దూరంగా వుంచాలి అని హెచ్చరిస్తాడు.

''స్త్రీలకు బుద్ధివికాసం చాల అవసరం. శీలమూ అంతే అవసరం" అని స్పష్టీకరిస్తాడు. "స్త్రీ తన భర్తను తప్ప మిగతా పురుషులందరిని పుత్రులుగా భావించాలి. పురుషుడికి తన భార్య తప్ప తక్కిన స్త్రీలందరూ తల్లులు అన్న భావన వుండాలి" అన్న ఆయన మాటలు నేటి అశ్లీలతా ధోరణుల మధ్య, అవాంఛనీయ సామాజిక పరిణామాల మధ్య - ఎంతో అవసరం!

ఛాందసాలు వదలిన తర్వాత, మనిషిలోని పరిపూర్ణతను వెలికితెచ్చే విద్య ప్రకాశించాక - ఇంకా తరతరాలుగా మన మనస్సులలో నాటుకుపోయిన కర్మ సిద్ధాంతాన్ని మన బాధ్యతలను తప్పించుకు తిరగడానికి సాకుగా వాడుతాము అని తెలిసిన స్వామీజీ ఆ విషయంలో వేదాంతవాణి యొక్క స్పష్టతను సత్యసంధతను ప్రతిబింబిస్తూ ఇట్లా పలికాడు:

''కర్మ అంటే ఏమిటి? విధి ఎక్కడుంది? మనం ఏ విత్తనాలు చల్లితే ఆ ఫలసాయము మనదవుతుంది. మన కర్మకు కర్తలం మనమే; మన క్రియలే! అందుకు ఎవరినీ దేనినీ నిందించ నవసరం లేదు. ఎవరినీ ప్రశంసించ నవసరం లేదు. గాలి వీస్తుంది, తెరిచిన తెరచాపలున్న పడవలు ఝామ్మని ముందుకు సాగిపోతాయి; తెరవని తెరచాపల పడవలు అట్లాగే వుండిపోతాయి. ఆ తప్పు గాలిదంటారా? పరమేశ్వరుడి కటాక్షం నిత్యమూ అందరిమీదా వుంటుంది. ఆ కృపను ఎట్లా వాడుకుంటాము అన్నది మన సంకల్పం మీద ఆధారపడి వుంటుంది.''

ఇది నిజంగా సోమరిపోతులకు, విధిని తిడుతూ శోకన్నాలు పెట్టే పిరికి పందలకు దివ్యామృతంలాటి బోధ!

నేడు దేశంలో వినవస్తున్న ''మతాల్ని దూరంగా వుంచాలి; మతాన్ని రాజకీయాలను వేరుచేయాలి'' అన్న నినాదం దృష్ట్యా ఆయన ఈ భారత జాతి జీవనంలో మత (ధర్మ) పాత్ర ఎటువంటిదో చెప్పిన మాటలు పదే పదే మననం చేసుకోదగినవి.

"భారత దేశంలో మొదటి స్థానం (మతం) ధర్మానిదే! మిగతావన్నీ దాని తర్వాతే సుమా! ఈ దేశపు ఆత్మ ఆ మతంలో వుంది. దానిని ఎవరూ నాశనం చేయలేకపోయారు. అందుకనే ఇన్ని దాడుల నెదుర్కొంది, ఇన్ని గండాల నెదుర్కొంది.

"వేలాది సంవత్సరాలుగా ఈ విధంగా రూపొందిన మన జాతీయ జీవనం గనుక 'తప్పు' అనదలచుకుంటే అనండి. కాని ఈ జీవన ప్రాతిపదికను గనుక మార్చదలిస్తే మాత్రం ఈ జాతి మరణించడం తథ్యం.

"మరణించినట్లే కన్పిస్తున్నా, మన జాతి ప్రాణం ఇంకా ఊపిరి తీసుకుంటూంది; ఆ ప్రాణం మతంలో నిక్షిప్తమై వుంది. ఈ జాతి జీవం మతం, ఊహ మతం. అంచేత మీ రాజకీయాలు, మీ సంఘం, మీ మున్సిపాలిటి, మీ ప్లేగు నివారణ కార్యక్రమం, క్షామపీడితులకు సాయాలు - మీరు ఎలా చేయదలచుకున్నా మతం ద్వారానే జరుగుతుంది; అది లేకుండా మీరెంత గీపెట్టినా మొత్తుకున్నా - ఏమీ కాదు, కాదు, కాదు.

"ఈ దేశపు ఆధ్యాత్మికత నొక చేత్తో గట్టిగా పట్టుకోండి. ఆ రెండోచేత్తో ప్రపంచంలోని ఇతర దేశాలనుండి ఏమేమి స్వీకరించ దలచారో వాటినెల్లా తీసుకోండి. ఆ అందుకునేదంతా ఈ ఆధ్యాత్మికతకు తల ఒగ్గవలసిందే! ఆ విధంగానే భారతదేశం వైభవోపేతమైన భవితవ్యాన్ని అందుకోగలదు; అందుకుంటుంది." కాని ఇవన్నీ వున్నాసరే మతాంతీకరణ అన్న మహమ్మారిని గనుక అరికట్టకపోతే దేశభక్తి లేనట్లే అన్న ఆయన మాటలు నేటి పాకిస్తానులో, బంగ్లాదేశ్‌లో, కాశ్మీరు సమస్యల నేపథ్యంలో ఎంత ఆచరణీయములోకదా అని ఆశ్చర్యం కొలుపుతాయి.

"మిత్రమా సీన్నా! మీ అమ్మను ఎవడయినా తిడితే ఏం చేస్తావయ్యా?"

"వాడి మీదకు కలియబడి దేహశుద్ధి చేసి పాఠం నేర్పిస్తా."

"సరిగా చెప్పావు. నీ మతం పట్ల కూడా నీకు అదే భావనవుంటే, మతం అంటే మాత అని నువ్వు భావిస్తే నువ్వు నీ హిందూ సోదరుడిని క్రైస్తవుడిగా మార్చడాన్ని భరించలేవు. కాని నేడు భరిస్తున్నావు. ఏమయింది నీ విశ్వాసం? ఎక్కడుంది నీ దేశభక్తి?" అని గర్జించా డాయన.

"విద్య, శీలము, ఆత్మవిశ్వాసము, సేవాభావము, త్యాగనిరతి అచంచలమైన దేశభక్తి - వుండాలి." అన్న తర్వాత ఆయన- "అధిక సంఖ్యాకులలో

ఉన్మాదాన్ని రేకెత్తించేది, ద్వేష భావాల్ని రగుల్కొల్పేది ఏదీ కలకాలం నిలవదు." అన్న మాట నేడు సమాజాన్ని రకరకాలుగ చీలుస్తున్న నాయకులు వింటే ఎంత బాగుండునో కదా!

నవ సమాజ నిర్మాణంలో వ్యక్తి పాత్రను ప్రాధాన్యతను ఆయన ఇట్లా చెబుతారు:

"వ్యక్తిని ఉన్నతుడిగా తీర్చిదిద్దండి. సమాజంలోని వ్యవస్థలూ, దేశము ఉన్నతమవుతాయి."

ఈ సమాజ నిర్మాణ కార్యక్రమాల్లోకి దిగేవారికి ఆయన సూచనలు-

—స్వార్థం లేకుండా పనిచేసే వారిని విజయం వరించి తీరుతుంది.

—సణుగుడు మానండి. మీకు అప్పజెప్పిన ధర్మాన్ని నిర్వర్తించండి.

—పొరబాట్లు, అపజయాలు - వాటిని పట్టించుకోకండి. వెయ్యిసార్లు ఓడితే వెయ్యినొకటవసారి ప్రయత్నంలో మీకు కావలసిన శక్తి మీ లోపల నుండే వస్తుంది.

ఒక జాతిగాని, వ్యక్తిగాని గొప్పదనాన్ని అందుకోవాలి అంటే ఈ మూడింటిని నమ్మాలి:

మంచి జయిస్తుంది.

అసూయ, అనుమానం విడనాడాలి.

మంచిని సాధించడానికై యత్నిస్తున్న ప్రతివారికి చేయూత నివ్వాలి.

ఈవిధంగా భారతీయులందరూ చేసినట్లయితే ఆ మహానుభావుడు కన్నకల నిజమవడానికి ఒక్క దశాబ్దికాలం కూడా అవసరంలేదు. ఏమిటా కల?

"నా జీవితమంత స్పష్టంగా నాకు కనపడుతున్న దృశ్యం ఏమిటో తెలుసా? చిరంజీవి అయిన ఈ నా తల్లి జాగరితయై, నవశక్తిపూరితయై, ఆనాటి కన్న మరింత వైభవంతో తన సింహాసనంమీద వెలుగుతోంది. శాంతి వాక్యాలతో ఆమెను గురించి విశ్వమంతా చాటండి!"

భారతీయుడయి పుట్టినవాడికి, ఇంతకన్న వర మేముంటుంది?

సాటి మానవులు, స్వదేశం, స్వధర్మం - ఈ త్రిపిటకాల ననుసరిస్తే ఒక్క భూగోళమేమిటి 'స్వదేశో భువన త్రయమ్' కాదా?

# సమాజంలో స్త్రీ : వివేకానందుని దృష్టి

—కుమారి డా॥ కమలా జయరావు

సమాజంలో మహిళల స్థితిగతుల గురించి, సమాజం వారికి కల్పించిన స్థానాన్ని గురించి ఆలోచించిన మొట్టమొదటి సన్న్యాసి స్వామి వివేకానంద. ఆదర్శ భారతీయ మహిళను గురించి ఆయన రచించిన చిత్రానికి స్వయంగా అన్ని జీవరేఖలు వేసారు. ఇతరులు చేయగలిగినది కాలానుగుణంగా ఆ చిత్రానికి మెరుగులు దిద్దడం మాత్రమే. వివేకానందునికి పూర్వం మహిళల స్థితిగతుల గురించి ఆలోచించిన సంఘ సంస్కర్తలు లేకపోలేదు; అందులో కొందరు రాజా రామమోహన్‌రాయ్ వంటి మహనీయులు సంఘ సంస్కర్తలు కాలాను గుణంగా, ఆయా సందర్భాలను బట్టి సంస్కరణలు సూచించారు, చేపట్టారు. వివేకానంద సంఘ సంస్కర్త కాదు. ఆదర్శ మహిళ సమగ్ర రూపాన్ని మనకు ఆయన అందించారు. సంఘ సంస్కర్తలు, మహిళాభ్యుదయవాదులు తదను గుణంగా వారి కార్యాలను రూపొందించుకొనాలి మాత్రమే.

ఒక సర్వసంగ పరిత్యాగి మహిళలను గురించి ఆలోచించడం విడ్డూరంగా తోచవచ్చు. కాని, వివేకానంద చేపట్టిన ప్రధానకార్యం (mission), భారతదేశం యొక్క ఆధ్యాత్మిక పునరుజ్జీవనం. ఆ ఉద్యమంలో సమాజంలోని ఏ ప్రధాన వర్గమే కాని పాలుపంచుకొనలేకపోతే, అది సఫలం కాజాలదు. అందుకే తన శిష్యవర్గంలో అగ్రగణ్యురాలయిన నివేదితతో, 'జనబాహుళ్యం (masses), మహిళలు-ఈ ఇద్దరినీ గుర్తుంచుకో' అన్నారు. విద్యకు నోచుకోని వర్గాలు, పలు విధాలయిన అన్యాయాలకు గురి అవుతున్న వర్గాలు, అన్ని విధాల అణచివేయ బడుతున్న వర్గాలు, అణగారిపోయి తామూ వ్యక్తులమేనని మరచిపోయిన వర్గాలు జనాభాలో అర్ధభాగం పైచిలుకు దౌర్భాగ్య జీవితాలు గడుపుతుంటే సమాజం పురోభివృద్ధి చెందజాలదనీ, స్తబ్దతతో కూడిన సమాజంలో ఆధ్యాత్మిక చైతన్యం ఉండదనీ, ఆధ్యాత్మికత లోపించిన భారతజాతి మృతప్రాయమని ఆయన గుర్తిం

చారు. తాను సన్న్యాసినని స్త్రీలను ఏవగించుకొనక, వారు కూడ ఆత్మస్వరూపు లని గౌరవించి, ఆ దృష్టితోనే మహిళల స్థితిగతులను గురించి ఆయన ఆలోచించారు. 'ఆత్మకు లింగభేదం లేదు. ఒకే ఆత్మ సర్వభూతములందు ఉన్నదని వేదాంతం ఘోషిస్తుండగా ఈ దేశంలో ఇంతగా స్త్రీ పురుష వ్యత్యాసం ఎందు కున్నదో నాకు అర్థంకాదు. ఆత్మపరమైన విషయాలలో లింగభేదం లేదు. స్త్రీని స్త్రీగా కాక మానవజాతిలో భాగంగా చూడగలిగినప్పుడే వారి అభివృద్ధి సాధ్యం; లేకపోతే వారు భోగ్య వస్తువులుగానే మిగిలిపోతారు. మన కార్యసాఫల్యానికి స్త్రీ పురుష లిరువురు అవసరం' అన్నారాయన.

## మహిళలు, విద్య :

వేదాంత సందేశాన్ని వాడవాడలా వ్యాపింపజేయడానికి వేనకు వేలు పురుషులు, వేనకువేలు మహిళలు అవసరమన్నారు స్వామీజీ. ఇందుకు ముందుగా మహిళలకు విద్యావకాశాలు కల్పించాలి. ఆనాడు, అనగా పందొమ్మిదవ శతాబ్దంలో సమాజంలో స్త్రీల స్థితి అతి నికృష్టంగా ఉండింది. బాల్యవివాహాలు, యౌవ్వనంలో అడుగిడక పూర్వమే వైధవ్యప్రాప్తి, వితంతువుల నికృష్ట జీవనం, అసూర్యంపశ్యలుగా ఇంటికే పరిమితమై, 'పిల్లల్ని కనే యంత్రాల'వలె జీవిస్తూ, ఎటువంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు నోచుకోని వడచుల దుస్థితి వివేకా నందుని మనస్సును చాల కలచివేసింది. ఆనాడు అమెరికన్ సమాజంలో స్త్రీలు నిర్వహిస్తున్న ప్రధాన పాత్రను చూచి ఆయన అచ్చెరువు పొందారు, ఎంతో సంతసించారు. వారికి గల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఆయనకు ఆనందం కలిగించాయి. భారతీయ మహిళ కూడ అటువంటి స్థితిని పొందాలని ఆయన ఆశించారు

దేశము, సమాజము అభివృద్ధి చెందాలంటే జనబాహుళ్యానికి (సామాన్య ప్రజానీకానికి), మహిళలకు విద్య అవసరమన్నారు స్వామీజీ. 'ఒక పక్షి ఆకాశంలో ఎత్తుగా ఎగరాలంటే దాని రెండు రెక్కలు పటిష్టంగా ఉండాలి. ఒంటి రెక్కతో అది పైకి ఎగరజాలదు. సమాజం ముందుకు నడవాలంటే స్త్రీ పురుషులిద్దరికీ సమాన విద్యావకాశాలు ఉండాలి. ఈ దేశంలో మహిళల విద్యకై గట్టి ప్రయత్నాలు జరగడం లేదు. మీ సుఖదుఃఖాలలో పాలుపంచు కొని, మీకు సేవా శుశ్రూషలు చేస్తూ, మీకోసం తమ ప్రాణాలను సైతం వదలు

కొనడానికి సిద్ధంగా ఉన్న మీ యింటి స్త్రీలకోసం మీరేం చేస్తున్నారు?' అంటూ పురుషులను ఎద్దేవా చేశారు స్వామిజీ.

వేదకాలంలో యువతులకు కూడ విద్యావకాశాలు ఉండినాయి. "వేదాంత సత్యాలను కనుగొన్నవారిని మేము రుషులంటాము. వారిలో కొందరు మహిళలు కూడా ఉన్నారని ఈ సభకు తెలియజేయడానికి నేను సంతసిస్తున్నా''నని అయన చికాగో సర్వమత మహాసభలలో చాటారు. స్త్రీలకు జ్ఞానవైరాగ్యాలు సులభ గ్రాహ్యాలు కావని పెద్దలన్నారని ఒక శిష్యుడు వివేకానందునితో అన్నప్పుడు, "ఏ శాస్త్రంలో ఏ పెద్దలు అన్నారో చూపించు. గార్గి, మైత్రేయివంటి బ్రహ్మ వాదినులు రుషిపీఠాల నలంకరించారు. ఈ దేశం అటువంటి స్త్రీలను మరల సిద్ధం చేయగలగాలి. చరిత్ర ఎల్లప్పుడు పునరావృతం అవుతూనే ఉంటుంది; పునరావృతం కావలసినదే'' అన్నారు. బ్రహ్మవాదినులతో అలరారిన ఆలనాటి స్థితిని ఆధునిక భారతదేశం తిరిగి అందుకొనాలని ఆయన ఆకాంక్ష.

పందొమ్మిదవ శతాబ్దంతో పోల్చితే నేడు భారతీయ స్త్రీలకు విద్యావకాశాలు చాల మెరుగయినాయన్నది వాస్తవం. కాని ఇది చాలమటుకు నగరాలకు, ఉన్నత, మధ్య తరగతులకే అందుబాటులో ఉన్నాయి. ఇక పొరుగు దక్షిణాది రాష్ట్రాలతో పోల్చితే ఆంధ్రప్రదేశ్‌లో మహిళా అక్షరాస్యత కనిష్ఠ స్థానాన్ని కలిగి ఉన్నది. మహిళల విద్యావకాశాలు మెరుగుపడని సమాజం ఎప్పటికీ వెనుకబడి ఉంటుందని వివేకానంద వ్యాకుచ్చారు.

పోతే, ఈనాడు దేశంలో లభ్యమవుతున్న విద్య అది యువతులకే కానీండి, యువకులకే కానీండి - వివేకానందుడు కోరిన చదువు కాదు. దీనిని అయన గురువు, శ్రీ రామకృష్ణ పరమహంస, 'పొట్టకూటి చదువు' అనీ, 'బియ్యం దోసకాయలు మూటకట్టుకొనటానికి పనికివచ్చే చదువు' అనీ, కొట్టి పారేశారు. ఆనాడు స్త్రీలు పిల్లలను కనే యంత్రాలుగా మిగిలిపోతున్నారని వివేకానందుడు వాపోతే, నేడు విద్యావతులయిన స్త్రీలు డబ్బు గడించే యంత్రాలుగా పరిగణింపబడుతున్నారు. ఒక యువతి విద్యార్హతలను ఆమె ఆర్జించే డబ్బుతో బేరీజు వేస్తున్నారే తప్ప, విద్యమూలంగా స్త్రీ తన ఇంటికీ, సమాజానికి అభ్యుదయం తేగలదన్న విషయాన్ని ఎవ్వరూ ఆలోచించడం లేదు.

వివేకానందుని దృష్టిలో విద్య శీల సంపదను, బుద్ధి కుశలతను పెంచి, స్త్రీల మనోస్థైర్యాన్ని పెంపొందించి, ఆమె కాళ్ళపై ఆమె నిలబడేటట్లు చేయ గలగాలి. మానవుని మానవునిగా తీర్చిదిద్దేది విద్య. మానవునిలో అంతర్నిహితమై ఉన్న దివ్యత్వాన్ని వెలికితెచ్చేది విద్య అన్నారు ఆయన. నేటి విద్యావ్యవస్థలో నైతిక విలువలకు శీల నిర్మాణానికి తావులేకుండా పోయింది. విద్యాభ్యాసం కేవలం వ్రాయడం, చదవడం, లౌకికజ్ఞానం (Secular knowledge) - వీటికే పరిమితమైనది. ఇందుమూలముగా యువత ఆలోచనలు ధనార్జన, మితిమీరిన సౌందర్యపోషణపైపే ఆగి, అంతకంటె ఉదాత్త స్థాయికి ఎదగడంలేదు.

''మనోస్థైర్యం కల స్త్రీలు తమ సమస్యలకు తామే పరిష్కారాలు వెదక గలరు. వారి సమస్యలను పూరించడానికి మీరెవరు? వారికి అనుకూలమయిన పరిస్థితులు కల్పించడమే మీ బాధ్యత అని పురుషులను హెచ్చరించారు వివేకానంద. సమాజం కానీ, ప్రభుత్వం కాని, రాజకీయ నాయకులు కాని ఈ విషయమై ఎక్కువ శ్రద్ధ చూపటం లేదు. వరకట్న సమస్య మరింత ఉధృతమవటానికి, జనాభా పెరుగుదల అరికట్టలేకపోవడానికి, నానాటికీ అధిక మవుతున్న మంచినీటి కొరత, ఇంధన వనరుల కొరతలకు కారణం - స్త్రీలకు ప్రధానమయిన ఇటువంటి సమస్యల పరిష్కారంలో స్త్రీలకు తగినంత ప్రాముఖ్యం, భాగస్వామ్యం లేకపోవడమే. ఆ సమస్యలను గురించి లోతుగా ఆలోచించి, పరిష్కార మార్గాన్వేషణకు తగిన అవకాశాలు, స్వేచ్ఛాపూరిత వాతావరణం వారికి లేదు.

విద్యావకాశాలు కల్పించడమంటే మరిన్ని విద్యాసంస్థలు ప్రారంభించడం, మరిన్ని డిగ్రీలు సంపాదించటం కాదు. డిగ్రీలు సంపాదించడం ఒక లక్ష్యం (End) కాకుండా, విస్తృత జ్ఞానోపార్జనకు వాటిని ఉపాయాలు (Means) గా మలచుకొనాలి. దేశచరిత్ర, సంస్కృతి, సాహిత్యాలతో మహిళలకు పరిచయం ఏర్పడాలి. విద్య మూలంగా మహిళల దృష్టి శరీరాలంకరణపైన,నవలల పఠనం పైన (ఈనాడు టి.వి.ని కూడ ఈ కోవలో చేర్చవచ్చు) మాత్రమే నిలిచేటట్లయితే మహిళలు నిరక్షరాస్యులుగానే ఉండడం మేలన్నారు వివేకానంద. శాస్త్రవిజ్ఞానం, భూగోళం ఇత్యాదులతోపాటు బాలికలకు జాతీయ లలితకళలు, హస్త కళలు, సంస్కృతిని కూడ బోధించే ఏర్పాటు చేయమని, బాలికల పాఠశాల ప్రారం భింపదలచిన నివేదితకు చెప్పారాయన.

ఈనాడు ఎంతమంది తల్లులు తమ పిల్లలకు ఐతిహాసిక పౌరాణిక గాథలను, ధర్మాన్ని, సుభాషితాలను నేర్పించగల స్థితిలో ఉన్నారు? మరొక ప్రక్క యువత ఫ్యాషన్ను, అలంకరణ, వస్త్రధారణ చూస్తే వారు చదవటానికో లేక పని చేయడానికో వెళ్ళుతున్నారా లేక పట్టపగలే పేరంటానికో, పార్టీకో వెళ్ళుతున్నారా అనే సందేహం కలగకమానదు. విద్యావతి సమాజాభ్యుదయం గురించి, సాటిస్త్రీల సమస్యల గురించి అవగాహన పెంచుకొనక, తన దృష్టిని సౌందర్యపోషణపై, విలాసాలపై, వినోదాలపై మాత్రమే నిలిపినా లేదా తన విద్యను ధనార్జన కొరకే వాడుకొన్నా సమాజం అధోగతి పాలవుతుంది.

విజ్ఞానశాస్త్రంలో పట్టభద్రులయిన మహిళలు సైతం మూఢనమ్మకాలు, అనవసర భయాలు కలిగి, ఈ విషయంలో విద్యావిహీనులకంటే ఏ విధంగాను వేరుగా లేరు. లభించిన జ్ఞానాన్ని ఆకళింపు చేసికొనలేకపోతే బుద్ధి వికసింపదు. అప్పుడు మనోస్థైర్యం ఉండదు.

భారతీయ సంస్కృతి, సంప్రదాయం, ఆధ్యాత్మిక జ్ఞానంలో నమ్మకం సడలించే విద్య నిరర్థకమే కాదు, హానికరం కూడా అన్నారు వివేకానంద. మహిళా విద్యపై ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలను ప్రస్తావిస్తూ, సోదరి నివేదిత ఇలా వ్రాశారు: 'సనాతనకాలపు ధ్యానమయ, తపోమయ జీవితాన్ని ఆచరించని భావి భారత నారీమణిని ఆయన ఊహింపలేకపోయారు. స్త్రీలు ఆధునిక విజ్ఞానశాస్త్రాన్ని నేర్చుకొనవలసినదే; కాని, అందుకోసం సనాతన ధర్మాన్ని విస్మరింపరాదు. ఆదర్శప్రాయమైన విద్య సమాజాన్ని అతలాకుతలం చేయక, మెల్లగా మార్పులు తీసుకువస్తుంది. ప్రాచీన భారతీయ మహిళల మహోజ్జ్వల చరిత్రను తిరిగి పుణికి పుచ్చుకొనడానికి దోహదం చేసేది అసలయిన విద్య అని ఆయన స్పష్టంగా పలికారు.'

శీల సంపద మనోస్థైర్యాలను పెంచి, మేధస్సును వికసింపజేసే విద్య లభించిననాడు భారతీయ మహిళ యావత్ప్రపంచానికి ఆదర్శం కాగలదని వివేకానందుని దృఢాభిప్రాయం. అటువంటి ఆదర్శ వనిత తన సంతానాన్ని

చక్కగా తీర్చిదిద్దగలదు. ఆమె సంతానం ఉదాత్త గుణాలు కలిగి దేశానికి ఎనలేని కీర్తి తేగలదని, అప్పుడే జాతి సంస్కృతి, శక్తి ఉజ్జ్వలంగా ప్రకాశిస్తా యని ఆయన అన్నారు.

## స్త్రీ - శక్తి స్వరూపిణి :

ఒక దేశమే కాని ఒక సమాజమే కాని మహిళలకు ఇచ్చే స్థానాన్నిబట్టి ఆ దేశం లేక సమాజం అభివృద్ధిని అంచనా వేయవచ్చన్నారు వివేకానంద. 'స్త్రీలకు సముచిత గౌరవాన్ని ఇచ్చిన దేశాలే గొప్పవి అవుతాయి' అన్నారు. కలకంఠి కంటి కన్నీరొలికిన సిరి ఇంట ఉండనొల్లదన్నారు పెద్దలు. ఇంట్లోనే కాదు - దేశంలో కూడ సిరిసంపదలు తరగిపోతాయి. 'మన జాతి యింతగా దిగజారిపోవడానికి కారణం, శక్తిస్వరూపిణులు అయిన స్త్రీలను మీరు గౌరవించక పోవటమే' అన్నారు స్వామీజీ.

దైవాన్ని పురుషరూపంలోనే కాక స్త్రీగా కూడ కొలిచిన దేశం భారత దేశం ఒక్కటే. 'త్వం స్త్రీ త్వం పుమాన్, త్వం కుమారీ ఉతవా కుమారః' అన్నది శ్వేతాశ్వతరోపనిషత్తు. స్త్రీ రూపంలో దైవాన్ని పరాశక్తి లేక ఆదిశక్తి అనీ, ఆమె జగజ్జనని అనీ భావించి పూజిస్తుంది హైందవ సమాజం. చైత్ర మాసంలో గౌరీ నవరాత్రుల నోముతో మొదలై, వసంత ఋతువులో ఉత్తరాదిన జరిపే వసంత పంచమీ సరస్వతీ పూజవరకు, మనదేశంలో దేవీపూజలు అనేకం జరుగుతాయి. అక్షరాభ్యాసం నాడు, సంగీత నాట్యాదికళల శిక్షణ ప్రారంభించిన నాడు సరస్వతిని, సిరిసంపదల కొరకు శ్రీ మహాలక్ష్మిని, కార్యసిద్ధి కొరకు దుర్గను, ఆహారం కొరకు అన్నపూర్ణను - ఈ విధంగా ఎన్నో రూపాలలో, ఎన్నెన్నో అభీష్టాలు నెరవేరడానికి దైవాన్ని స్త్రీ రూపంలో పూజిస్తున్నాము. కాని, కన్నకూతురిలో, కట్టుకున్న ఇల్లాలిలో, కళ్యాణతిలకంతో ఇంటి గడప తొక్కిన కొత్త కోడలిలో, కన్నతల్లిలో ఆ దైవాన్ని చూడలేకపోతున్నది మన సమాజం. ఇంటి వెలుపల స్త్రీలకు ఎదురయ్యే ఇబ్బందులను, సమస్యలను అటు ఉంచండి - ఇంట్లోనే ఆమె ఎన్ని అవమానాలకు, అన్యాయాలకు గురి అవటం లేదు?

ఒకసారి శ్రీ రామకృష్ణ పరమహంస ఒక భక్తునితో 'నీ భార్య ఎటువంటిది?' అని అడిగారు. 'మంచిదే, కాని అజ్ఞానురాలు' అన్నాడా యువకుడు. 'ఓహో, నువ్వు గొప్ప జ్ఞానివి కాబోలు!' అని ఛీత్కరించారు రామకృష్ణులు. ఆ సమాధానంలో భారతీయ సమాజానికి సర్వసాధారణంగా స్త్రీపట్ల గల న్యూనతా భావం స్పష్టమయింది. ఆడవారికి ఏమీ తెలియదని లోకువచేసి, అగౌరవపరచే భావ మది. నారీ రూపంలో ఉన్న దైవీశక్తిని కించపరచి, ప్రతిమలలో దేవీ పూజలు చేసే సమాజంలో ఎంత మిథ్యావాదం (hypocrisy) ఉన్నదో, ఆ పూజలు ఎంత నిరర్థకాలో తెలుస్తున్నది.

శ్రీమద్భాగవతం తృతీయ స్కంధంలోని కపిలోపాఖ్యానంలో కపిలుడు తన తల్లి దేవహూతికి ఇచ్చిన ఉపదేశంలో ఈవిధంగా అంటాడు :

అనిశము సర్వభూత హృదయాంబుజవర్తి యనం దనర్చు నీ
శు నను నవజ్ఞ సేసి మనుజుండొగి మత్ప్రతిమార్చనావిడం
బనమున మూఢుడై ఉచితభక్తిని సన్ను భజింపడేని న
మ్మనుజుడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాడగున్.

కనుక శక్తి తత్త్వాన్ని అర్థం చేసికొని, స్త్రీలను పరాశక్తి ప్రతీకలుగా గౌరవించిననాడే దేశం నిజంగా అభివృద్ధి చెందుతుందని స్వామీజీ అభిప్రాయ పడ్డారు. స్త్రీలను కించపరిచే జాతి, స్త్రీలను అవమానించే జాతి ఎన్నటికీ పురోగమింపజాలదని ఆయన అన్నారు.

## ధైర్యసాహసాలు :

స్త్రీలు ధైర్యసాహసాలు కలిగివుండి, అన్ని పరిస్థితులను ఎదుర్కొనగలగాలని వివేకానందుని అభిప్రాయం. వారిలో అపారమైన శక్తి ఉన్నదని బాల్యం నుండి తెలియజెయ్యాలి. తమలో అంతర్నిహితమై ఉన్న శక్తిని వెలికి తెచ్చి, దానిని సమాజ కల్యాణానికి వినియోగించాలని ఆయన వాంఛించారు. ఝాన్సీ లక్ష్మీబాయి ధైర్యసాహసాలను ఎంతగానో ప్రశంసించి, ఆమెను ఒక ఆదర్శంగా తీసికొనమన్నారు. ధైర్య సాహసాలలో స్త్రీ పురుషునికి ఏవిధంగాను తీసిపోదు. వీథిలో కుక్కను చూచి భయపడే స్త్రీ, తన పాపపైకి పులి ఉరకబోతే,

ఆ పాపకు పులికి మధ్య తాను నిలుస్తుంది! ఆమెలోని మాతృశక్తి ఆ సాహసానికి కారణం. కనుక, బాలికలకు వీరనారీమణుల గాథలను చెప్పి, తమలో కూడ అంతటి ధైర్యసాహసాలున్నాయనే ఆత్మవిశ్వాసాన్ని కలిగించాలి. తన పాశ్చాత్య శిష్యురాళ్ళకు రాజపుత్ర నారీమణుల ధైర్యసాహసాలను వర్ణించి, ఆ వీరగాథలను చెప్పి వారి గుణగణాలను కళ్ళకు కట్టేటట్లు వర్ణించారు. వీరు భారతీయులకు ఆదర్శపాత్రులవాలని అనేవారు స్వామి వివేకానంద.

తన గురుదేవులు తలపెట్టిన మహత్తర కార్యంలో తన వంతు పాత్ర నిర్వహించడానికి, వివేకానందుని శిష్యవర్గంలో అగ్రగణ్యురాలయిన విదేశీ వనిత మార్గరేట్ నోబెల్ (సోదరి నివేదిత) భారతదేశం రాదలచారు. అపరిచితమయిన జాతి, వేషభూషలు వేరు, భాష అపరిచితం, ఆహారపు అలవాట్లు వేరు, భారతీయ కులవ్యవస్థలోని కట్టుబాట్లు ఊహకందనటువంటివి, వాతావరణ పరిస్థితులు చాల ప్రతికూలం, ఇన్నీ ఎదుర్కొని తట్టుకొనగలగాలి ఆమె. ఇందుకు సిద్ధమయితే రమ్మన్నారు స్వామీజీ. 'మాకు ప్రస్తుతం కావలసినది పురుషుడు కాదు, స్త్రీ. భారతీయుల కొరకు, ముఖ్యంగా భారతీయ మహిళలకొరకు పాటుపడగల ఒక అసలు సిసలైన సివంగి (Lioness) మాకు అవసరం; భారతదేశం ప్రస్తుతం గొప్ప మహిళలను అందించగల స్థితిలో లేదు. కనుక మిమ్మల్ని విదేశాల నుండి రప్పించుకొనే పరిస్థితి మాది. నీ విద్య, నిజాయితీ, పవిత్రత, ప్రేమ, పట్టుదల, అన్నిటినీ మించి నీలో ప్రవహిస్తున్న వీరరక్తం కారణంగా నీవే ఈ సమయానికి తగిన నారీమణివి' అని ఒక లేఖలో వ్రాశారు. ప్రస్తుతం గొప్ప మహిళలను అందించే స్థితిలో మనదేశం లేదని చెప్పడంలో, భారతీయ మహిళలు ఆ స్థితికి రాగలరన్న ఆయన విశ్వాసం గోచరమవుతుంది. భారతదేశాన్ని మనం తిరిగి పొందడానికి (ఆనాడు దేశం పరాయి పాలనలో ఉండింది) ఐదు వందల పురుషులకు ఏబది ఏళ్ళు పట్టవచ్చు. అంతేమంది స్త్రీలు ఆ పనిని కొన్ని వారాలలో సాధించగలరని నివేదితకు చెప్పినప్పుడు, భారతవనిత శక్తిసామర్థ్యాలపై ఆయనకు గల విశ్వాసం ఎటువంటిదో మనకు తెలుస్తుంది. భారతదేశపు స్వాతంత్ర్య సమరాంగణంలోకి ధైర్యంతో ముందు కురికిన మహిళాలోకం ఈ సత్యాన్ని నిరూపించింది.

భారతీయ సమాజం స్త్రీలలో నిస్సహాయతను, పరాధీనతను ప్రోత్సాహిస్తున్నదనీ, కనుకనే వారు కష్టాలను ఎదుర్కొనక, కన్నీరు పెట్టడం మినహా

తమ కాళ్ళపై నిలబడే ప్రయత్నం చేయడం లేదని వివేకానంద వ్యాఖ్యానించారు. స్త్రీలు ధైర్యాన్ని ప్రకటించే పరిస్థితులు పురుషులు కల్పించడం లేదన్నారు. స్త్రీలు సమస్యలకు పరిష్కారాలు కనుగొనే పరిస్థితులు కల్పించాలి. వారు పరాధీనులుగా ఉండకూడదు. తమ భవిష్యత్తుకు తామే బాట వేసికొనాలి. 'నేటి స్త్రీల దుస్థితికి కారణం. పురుషులే వారి భవితవ్యాన్ని నిర్ణయించడం. నేను పురుషులకు ఏ సందేశమిస్తానో, స్త్రీలకు అదే ఇస్తున్నాను. శక్తిమంతులు కండి, ఆశను విడనాడకండి; ఇది సిగ్గుపడవలసిన పరిస్థితి కాదు. భారతదేశం పట్ల శ్రద్ధ కలిగి ఉండండి' అన్నారు.

పాశ్చాత్య దేశాలలో స్త్రీలు వాహనాల నుండి దిగుతున్నప్పుడు, మెట్లు దిగుతున్నప్పుడు పురుషులు చేయి అందించడం ఒక సంప్రదాయంగా ఉండేది. ఈ ఆచారాన్ని పాటించకపోవడం మర్యాదకు భంగంగా భావించారు. ఇటీవల కాలంలో, ఫెమినిస్ట్ ఉద్యమాలు ప్రారంభమయిన పిదప ఇది తగ్గింది. కాని వివేకానందులు ఆ కాలంలోనే దీనిని గర్హించారు. తన చేతిని అందించేవారు కాదు; అయితే సన్న్యాసి స్త్రీలను స్పర్శించకూడదన్న కారణంతో కాదు. ఆ ఆచారం స్త్రీలను కించపరుస్తున్నదని ఆయన భావించారు. 'నా చేయి అందించి నేను మిమ్మల్ని కించపరచజాలను. వృద్ధులకు, బలహీనులకు చేయూతనిస్తాను. కాని నాకున్న శక్తి మీలో కూడ ఉన్నది. స్వావలంబులు కండి' అని ఒక నూతన దృక్పథాన్ని చూపించారు. 'ఈ Chivalry అన్నది నాకు సమ్మతం కాదు. ఇది మీలో నిస్సహాయతను ప్రోత్సహిస్తున్నదని మీరు గ్రహించుట లేదు. Chivalry కేవలం స్త్రీ పురుష సంబంధమేకాని అందులో గౌరవం ఏమాత్రం ఇమిడిలేదని తెలిసికొనండి' అన్నారు.

## మాతృస్థానం :

పాశ్చాత్య సమాజంలో స్త్రీపురుషుల సంబంధాలకు ఎక్కువ ప్రాముఖ్యత ఉంటుంది. పాశ్చాత్యుని జీవితంలో భార్య ప్రధాన పాత్ర నిర్వహిస్తుంది. దీనికి గల కారణాలలో ఒకటి. వారి వివాహాలు పెద్దలు కుదిర్చినవి కాకపోవడం; రెండవది, అక్కడ ఉమ్మడి కుటుంబాల సంప్రదాయం లేకపోవడం. అందుకే ఒక శిష్యురాలికి వ్రాసిన లేఖలో, వివేకానంద సరదాగా క్రింది పద్యం వ్రాశారు :

**A son is a son till he gets a wife,**
**A daughter is a daughter all her life!**

కాని పాశ్చాత్య సమాజంలో ప్రతి స్త్రీని గౌరవిస్తారు. ఆమె కూర్చొనక ముందు పురుషులు కూర్చొనరు, నిలబడ్డ స్త్రీ ఎదుట కూర్చొని మాట్లాడరు. వాహనంలో ఆమె ముందు ఎక్కాలి. ఈ సంప్రదాయాలను శక్తి ఉపాసనగా వర్ణించారు వివేకానంద.

భారతదేశంలో మాతృస్థానం అన్నిటికన్న ఉత్తమమైనది. భారతదేశంలో తల్లి స్త్రీత్వానికి ఆదర్శమన్నారు వివేకానంద. మాతృదేవోభవ అని తల్లిని దైవంగా పరిగణించింది భారతజాతి. ప్రతి జీవిలోను గల ప్రేమ, సానుభూతి త్యాగం, సేవ, ఓర్పు మొదలయిన మాతృగుణాలను గుర్తించి, 'యా దేవీ సర్వ భూతేషు మాతృరూపేణ సంస్థితా' అని కీర్తించారు.

మాతృ స్థానానికి ఇంత ప్రాముఖ్యత నివ్వడమే స్త్రీల ప్రస్తుత స్థితికి కారణమనే వాదం కూడ ఉన్నది. అది ఆమె శారీరక మాతృత్వానికి సంబంధించినది మాత్రమే. అది 'పిల్లలను కనే యంత్రాలుగా చూచే దృష్టి'గా, వివేకానంద గర్హించారు. స్త్రీని మాతృ స్థానంలో నిలబెట్టడం, ఆమెను పవిత్రతకు ప్రతీకగా కొలవటం. ఎంతటి నీచుడైనా కన్నతల్లిని స్త్రీ భావంతో చూడడు, చూడజాలడు. అతని హృదయంలో ఆమె కొక ప్రత్యేక ఆరాధనాస్థానం ఉంటుంది. అటువంటి గౌరవాన్ని కన్నతండ్రి పొందవచ్చు, పొందకనూ పోవచ్చు.

ప్రతి స్త్రీని జగన్మాత అంశంగా గుర్తించి, ఆమెను మాతృభావంతో గౌరవించమన్నారు శ్రీ రామకృష్ణ పరమహంస సన్న్యాసులు స్త్రీలను ఏవగించుకొనకూడదు, వారి ఆధ్యాత్మిక సాధనా పథంలో అవరోధాలుగా పరిగణించకూడదు - స్త్రీని జగన్మాత అంశంగా గుర్తించి మన్నన చేయమన్నారు.

ప్రతి పురుషుడు తన భార్యను తప్పించి, ప్రతి స్త్రీని తల్లిగా భావించాలి, ప్రతి స్త్రీ ప్రతి పురుషుని కన్నకొడుకు వలె ఆదరించాలి అన్నారు స్వామి వివేకానంద. మన తెలుగువారిలో ప్రతి స్త్రీని, ప్రతి బాలికను - వయస్సు, వృత్తి, కులం ఇత్యాదులతో నిమిత్తం లేకుండా, అమ్మా అని పిలిచే సత్సంప్రదాయం

ఉన్నది. ఇది రాను రాను తగ్గిపోతూ ఉండడం శోచనీయం. ఈ పిలుపులోని అంతరార్థాన్ని ఆధునిక యువతులు కూడ గుర్తించాలి. Madam, aunty అని నేడు చెలామణిలో ఉన్న పదాలలో అమ్మ పదంలో ఉన్న గౌరవం, ఆప్యాయత స్ఫురించవు.

రామా అనే పదాన్ని ఉచ్చరించినప్పుడు, రా అని నోరు బార్ల తెరచితే దోషాలన్నీ బయటకుపోతాయనీ, మా అని రెండు పెదవులను దగ్గరకు చేర్చితే ఆ దోషాలు తిరిగి లోపలకు పోజాలవని చెప్పుతారు. అమ్మ అనే పదంలో, 'మ' కు ఒత్తు కూడా ఉన్నది. ఆ పిలుపు విన్నవారు ఎదుటి వ్యక్తి దోషాలను చూడలేరు. తల్లి తన సంతానంలోని దోషాలను చూడదు, వాటిని క్షమిస్తుంది. అవసరం వస్తే వాటిని స్వయంగా స్వీకరిస్తుంది. తల్లి ప్రేమ అవ్యాజ్యమైనది, అమరమైనది, కనుక అందరి స్త్రీలలోను తల్లిదే అగ్రస్థానం అన్నారు వివేకానంద.

తల్లి అన్నపూర్ణవంటిది. ఇంట్లో అందరికీ వడ్డించి, వారి భోజనానంతరమే తాను భుజిస్తుంది. ఇంటికి వచ్చిన వారికి ఆతిథ్యం ఇవ్వటంలో ఆమెది అంద వేసిన చేయి. కనుక తల్లి ఆరాధ్యురాలు. ఆతిథ్య విషయంలో భారతీయ మహిళలకు మరే దేశంవారు సాటిరారని విదేశీయుల ప్రశంస నందుకున్నది మన జాతి.

భార్య, పిల్లలు ఒక వ్యక్తిని వదలిపోవచ్చు. తండ్రి పిల్లలను నిరాదరించ వచ్చు; కుటుంబాన్ని వదలిపోవడం ఇక సర్వసాధారణమే కాని, తల్లి ఎట్టి పరిస్థితులలోను తన సంతానాన్ని నిరాదరించదు. 'కుపుత్రో భవేత్ క్వచిదపి, కుమాతా న భవతి' (సంతానం చెడ్డవారు కావచ్చు, కాని, తల్లి ఎప్పుడూ చెడ్డది కాదు) అన్నారు ఆదిశంకరులు. తల్లి నిస్వార్థం సహనం, క్షమాగుణాల కారణంగా భారతీయ స్త్రీత్వానికి తల్లి ఆదర్శం అన్నారు వివేకానంద. కనుక ప్రతి స్త్రీ తనలోని మాతృశక్తిని గుర్తించాలని, ప్రతి పురుషుడు ప్రతి స్త్రీని తల్లిగా భావించి గౌరవించాలని వివేకానంద ఉద్బోధించారు.

నేడు సమాజంలో స్త్రీలపై అత్యాచారాలు, మానభంగాలు, ఆడపిల్లలను వేధించటం (eve - teasing) నానాటికీ ఎక్కువ కావటానికి కారణం- భారతీయ సంస్కృతిలో ఒక ప్రధానాంశాన్ని, ప్రతి మహిళ జగన్మాత అంశమని గౌరవిం

చాలనే సూత్రాన్ని సమాజం విస్మరిస్తున్నది. నగరాలలో పట్టపగలు కూడ ఆడ పిల్ల ఒంటరిగా సంచరించడానికి బెదిరే పరిస్థితులు వచ్చాయి. ఈ సమస్యకు పరిష్కారం చట్టాల ద్వారా రాజాలదు వివేకానందులు చెప్పినట్లు దీనికి ప్రధాన బాధ్యత మహిళలే వహించాలి. ప్రతి తల్లి తన సంతానానికి, ప్రతి ఆడపిల్ల తన తోబుట్టువులకు, స్త్రీలందరినీ జగన్మాత అంశాలుగా గౌరవించాలనీ, తాము ఇతర స్త్రీలు వేరుకారని బోధించాలి. ఇందుకు, ముందస్తుగా ప్రతి స్త్రీ హృదయం వికసించాలి. తన సంతానాన్ని మాత్రమే కాక ప్రతి ఒక్కరినీ తన సంతానంవలె మాతృవాత్సల్యంతో ఆదరించే స్థితి చేరుకొనే ప్రయత్నం చేయాలి. అప్పుడు కోడలిని కూతురితో సమానంగా ఆదరించగలుగుతుంది.

ఇంట్లోని పని పిల్లను, బజార్లో చిల్లర వస్తువులమ్ముకొనే పేదరాలిని, పొరుగింటి అమ్మాయిని, ప్రతి ఒక్కరినీ కుల మత భేదం చూపక, ఒక తల్లిగా ఆదరించగలగాలి. ఇటువంటి స్థితిని సమాజంలోని స్త్రీలు, ముఖ్యంగా విద్యావతులు అందుకొన్ననాడు పై పేర్కొన్న సమస్యలనే కాని, వరకట్న సమస్యలనే కాని, అత్తింటి ఆరళ్ళనే కాని అరికట్టటం సాధ్యం కాగలదు. ప్రతి అత్త ఒకనాటి కోడలే అనే నానుడికి మారుగా ప్రతి స్త్రీ ఒక తల్లి అనే నినాదం చేపట్టాలి. స్త్రీ విద్య ఆమె హృదయాన్ని వికసింప జేసి, శీలాన్ని పెంచి, ఆమెలోని మాతృ గుణాలను వెలికి తెచ్చేటటువంటిది అయి ఉండాలని వివేకానంద కాంక్షించారు. విద్య ఆమెలో ఈ రాణింపు తీసికొనిరాలేని పక్షంలో ఆమె నిరక్షరాస్యురాలుగా మిగిలినా నష్టమేమీ ఉండదన్నారు ఆయన. 'ఇటువంటి మాతృహృదయం కల పవిత్రమూర్తులను ఒక వేయిమందిని మన దేశం సిద్ధం చేయగలిగిన నాడు భారతీయుల పేరు సార్థకమవుతుంది. అప్పుడు నేను ప్రశాంతంగా కన్ను మూస్తాను' అన్నారు స్వామిజీ. ఆ వెయ్యిమందిలో తాను కూడా ఒకతెగా పరిగణింపబడుతుందా అని ప్రతి మహిళ ఆత్మావలోకనం చేసికొనాలి.

## ఆదర్శనారీరత్నం - సీత :

జనకపుత్రి సీత భారతీయ మహిళకు ఆదర్శమని వ్రాకుచ్చారు వివేకానంద. 'సీతకు జన్మనిచ్చిన జాతి - ఒకవేళ సీత ఒక పౌరాణిక, ఊహాకల్పిత పాత్ర మాత్రమే అయినా, ఆ జాతికి స్త్రీల పట్ల గౌరవం ఇలలో సాటిలేనిది' అన్నారు. 'సీతాతత్త్వం మన నరనరాలలో ఇంకిపోయింది. సీత ఆదర్శానను

పుణికిపుచ్చుకొనక, మన మహిళలను ఆధునికులుగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం చేస్తే అది విఫలమవుతుంది. భారతీయ మహిళలు సీత అడుగుజాడల ననుసరించి నడచుకొనాలి, మరొక మార్గంలేదు' అని ఆయన ఘంటాఘోషంగా చెప్పారు.

సీతను ఆదర్శంగా నిలబెట్టిన కారణంగానే మన మహిళలు అన్ని అవమానాలను దిగమింగి, నిస్సహాయంగా బేలలవలె ఉన్నారనే వాదం ఒకటి కొన్ని కోణాలలో ఇటీవల వినపడుతున్నది. ఇది సరయిన వాదం కాదు. రామాయణాన్ని, సీత పాత్రను సరిగ్గా అవగాహన చేసికొనే ప్రయత్నం చేయని ఆధునికుల వాదన ఇది. మహిళల నిస్సహాయ స్థితికి కారణం (సీత ఆదర్శానికి సంబంధించినంతవరకు), సీత పాత్రను తమ స్వార్థానికై, వక్రించి చూపే పురుషాధిక సమాజానిది. సీత బేలా కాదు, అబలా కాదు. అడవికి రామునితో పాటు వెళ్ళాలనే నిర్ణయం స్వయంగా తీసికొన్నది, రెండవసారి అగ్నిపరీక్షకు లోనవరాదనే నిర్ణయమూ ఆమే తీసికొన్నది.

'సీత - పరమపావని, క్షమారూపిణి!

'భారతదేశంలో గల మంచితనానికి, పవిత్రతకు, శుద్ధతకు మారుపేరు సీత. స్త్రైణ్యగుణాలన్నీ సీతలో ఉన్నాయి. సీత సహనశీల, క్షమారూపిణి, నిత్యశుద్ధ స్వరూపిణి, మహా పతివ్రత. ఎన్ని కష్టాలు అనుభవించినా రాముని గురించి ఒక్క దూషణవాక్కు లేదు. హింసకు ప్రతీకారంగా హింస తలపెట్టే పగ ఆమెలో లేదు. సీతవలె ఉండండి' అని వివేకానందులు వ్రాసారు.

భారతీయ మహిళలు తమ వ్యక్తిత్వాన్ని మరచిపోయి, అణిగి మణిగి ఉండడానికి సీత ఆదర్శం బలమైన కారణమన్నది ఎంత అపవాదమో, సీతవలె ఎదురుతిరగక భర్త పెట్టే కష్టాలను సహించమనడం కూడా అంతే తప్పుడు వాదం. రాముడు సీతను ఏవిధంగానూ, ఎన్నడూ కష్టపెట్టలేదు. తనతో అడవికి రమ్మని శాసించనూ లేదు. జీవితంలోని కష్టసుఖాలను దంపతులు సమానంగా అనుభవించాలని చూపిన ఆదర్శసతి సీత.

'ప్రపంచ సాహిత్యంలో సీతపాత్ర న భూతో న భవిష్యతి. ఆ పాత్ర ఎల్లకాలాల కొరకు సృష్టింపబడింది. రాములు అనేకులు జన్మించవచ్చు. సీత

మాత్రం ఒక్కటే' అన్న వివేకానందునికి ఆ ఆదర్శంపట్ల ఎంత పవిత్రభావం, పూజ్యభావం ఉండిందో అర్థమవుతుంది.

'భారతీయ మహిళకు నిర్వచనం సీత. భారతీయ మహిళలు కోరుకొనే ఆదర్శాలన్నీ ఆమెలో ఉన్నాయి. కనుకనే ఇన్ని వేల సంవత్సరాలుగా, ఆసేతు మహిమాచల పర్యంతం ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ, ప్రతి బాలుడు, ప్రతి బాలిక ఆమెను ఆరాధ్యదైవంగా కొలుస్తున్నారు' అన్నారు వివేకానంద. 'భారతీయులు వేదాలను పూర్తిగా విస్మరింపవచ్చు. సంస్కృతం మృతభాష కావచ్చు. కాని, ఐదుగురు హిందువులు మాత్రమే ఈ గడ్డపై జీవించివున్నా వారి నాలుకలపై సీత చరిత్ర పలుకుతుంది. అది జానపదుల భాషయే కావచ్చు కాని, సీత చరిత్రను, సీత ఆదర్శాన్ని, భారతీయులు మరువలేరు, మరువరాదు' అన్నారాయన.

సోదరి నివేదితకు వ్రాసి ఇచ్చిన ఒక చిన్న పద్యంలో 'తల్లి హృదయము వీరుని సంకల్పము' కలిగి ఉండమని దీవించారు ఆయన. సమస్త కష్టాలను ధైర్యంతో ఎదుర్కొని, లక్ష్యసిద్ధికి పాటుపడే సంకల్పం; ఎదుటి వారిలోని మంచిని మాత్రం చూచి వారి దోషాలను క్షమించే మాతృహృదయం. ఈ రెండు లక్షణాలు సీతలో ఉన్నాయి. రాముని అనుసరించి అరణ్యానికి వెళ్ళాలని ఆమె నిశ్చయించినప్పుడు, రాముడు ఏకరుపు పెట్టిన కష్టాలు ఆమె సంకల్పాన్ని వెనుదీయించలేదు. రావణుని ప్రలోభాలు, ఆమెను హతమారుస్తానన్న బెదరింపు ఆమె సంకల్పాన్ని సడలించలేదు. రామచంద్రుని తప్ప మరొక పురుషుని కన్నెత్తి చూడనన్న ఆ పాతివ్రత్యం స్త్రీపురుష సంబంధానికి, సామాజిక కట్టుబాటుకు మాత్రమే సంబంధించినది కాదు. సీత పాతివ్రత్యం భారతనారికి ఆదర్శం!

ఇక్కడ పాతివ్రత్యంగురించి ఒక మాట చెప్పవలసి ఉంది. పాతివ్రత్యాన్ని, స్త్రీల బానిసత్వంగా కాని, అణచివేతగా కాని పరిగణించకూడదు, ఆ విధంగా ఆమెను వంచించనూ కూడదు. భర్త ధర్మపర్తనుడు కానప్పుడు, ఆమెను నానా హింసలకు గురి చేసినప్పుడు, అతడిని వదలి వెళ్ళే స్వాతంత్ర్యం భార్యకు తప్పనిసరిగా ఉండాలి. సీత పాతివ్రత్యం ఒకే ఒక పురుషునకు కట్టుబడి ఉండడం అనే సంకుచిత పరిధిలో వీక్షింపకూడదు. అది ఒక ఆదర్శానికి, నీతికి

కట్టుబడి ఉండడం. తుచ్ఛ ప్రలోభాలకు లొంగని వజ్రసంకల్పం అది. జీవితం సుఖదుఃఖాల కలయిక. ఒక వ్యక్తితో సుఖాలను పంచుకొన్నప్పుడు ఆ వ్యక్తి కష్టాలను కూడా పంచుకొనాలనే ధర్మ సూత్రం. ఇది స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా వర్తిస్తుంది.

తన గొప్పదనాన్ని తగ్గించుకొని, ఎదుటివారి గుణగణాలకు ప్రాధాన్య మివ్వటం మాతృహృదయానికి సులభసాధ్యం. తాను రావణుని శపించి నాశనం చేయగలిగినా, రాముని శౌర్యపరాక్రమాలు లోకానికి చాటాలనే నిస్వార్థం సీతలో మనకు కనపడుతుంది. ఆమెను పీడించి, హింసించిన రాక్షస స్త్రీలను చంపడానికి అనుమతి కోరిన హనుమంతును, 'కశ్చిన్నాపరాధ్యతి' అని స్త్రీవధను వారించిన ఔదార్యం, మాతృవాత్సల్యానికి, తల్లి క్షమా గుణానికి నిదర్శనం. మాతృ హృదయం తప్పించి దుర్మార్గుల దోషాలను ఎవరు క్షమించగలరు?

## శ్రీమాత శారదాదేవి :

సీతను ఇంతగా కీర్తించి, ఆ ఆదర్శాన్ని తలచినప్పుడు వివేకానంద అంతగా తన్మయులు కావటానికి కారణం బహుశా ఆయన మనోఫలకంపై తన గురుపత్ని శ్రీమాత శారదాదేవి నిలిచి ఉండవచ్చు. ఆ సీతమ్మతల్లి మరల ఈ నారీశిరోమణిగా అవతరించినదని ఆయన గట్టిగా నమ్మి ఉండవచ్చు. శ్రీశారదా దేవికూడ పావన చరిత, పవిత్రతా స్వరూపిణి, క్షమారూపిణి, సహనశీల. సమాజం చేత దొంగ అని పిలువబడిన వానిని, పతితులని ముద్ర పొందిన వారిని నా సంతానం అని చేరదీసిన ఔదార్యం, క్షమ; సాంసారిక కష్టాలను వెళ్ళగక్కే వారి గోడును వినే ఓపిక, సానుభూతి, వారికి ఓదార్పునిచ్చే అనుకంప; తనచుట్టూ నివసించే బంధుజనుల ప్రాపంచికపు గొడవలను, వారి అజ్ఞానాన్ని భరింపగల సహనం; ప్రతి ఒక్కరికీ ఆప్యాయతతో అన్నం వడ్డించి, వారికై కని పెట్టుకుని కూర్చొని, వారి బాగోగులు కనుక్కొని కన్నతల్లిని మరపింపజేసే మాతృవాత్సల్యం; రోగుల మలమూత్రాదులను సైతం శుభ్రం చేసిన సేవా భావం; తన కొరకు ఏమీ కోరుకొనక, శారీరక మాతృత్వాన్ని సైతం కూడా కోరుకొనని త్యాగ నిరతి; చంద్రునిలో ఉన్నపాటి కళంకం సైతం తనలో ఉండరాదని తపించిన పవిత్రత; భర్తలో కాళీమాతను దర్శించిన ఆధ్యాత్మిక

ఔన్నత్యం; వనవాసం చేస్తున్న సీతవలె నిరాడంబర వేషభూషలలో తన గొప్ప తనాన్ని కప్పివేసికొన్న నిగర్వి - ప్రతి విషయంలోను సీతను పోలిన మహిళ, సీతను మరపింప జేయగల ఆదర్శ స్త్రీమూర్తి.

శారదామాతను గురించి వివేకానందుడు బహిరంగోపన్యాసాలలో ప్రస్తావించలేదు. పరుల కంటపడని 'లజ్జాపటవిభూషిత' (లజ్జను మేలిముసుగుగా కప్పుకొన్న) ఆ మాతృమూర్తిని గురించి పదుగురి ఎదుట మాట్లాడి ఆమె ప్రతిష్ఠను దిగజార్చటం ఆయనకు ఇష్టం లేదు. గురుదేవులు శ్రీరామకృష్ణులను గురించి సైతం ఒకేసారి, అదీ పాశ్చాత్య శిష్యుల అభ్యర్థన మేరకు మాట్లాడారు. 'నేను వ్యక్తులను గురించి మాట్లాడను. వారి ఆదర్శాలను మాత్రమే ప్రచారం చేస్తాను' (I do not preach persons but principles) అన్నారాయన. కాని, శారదాదేవి చరిత్ర ఎరిగిన వారికి, సీతను వర్ణించినప్పుడు వివేకానందులు తన గురుపత్నిని గురించికూడా మాట్లాడినారన్నది విస్పష్టం.

శ్రీమాత శారదాదేవిని ఆలంబనంగా చేసికొని, ఆమె జీవితాన్ని కేంద్రంగా చేసికొని, ఈ పుణ్య భూమిలో గార్గి, మైత్రేయి, సులభ వంటి వారు తిరిగి ప్రత్యక్షమవ్వాలని ఆయన కాంక్షించారు. మానవుడు ఏ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోరినా, అవి అతనిలో దాగున్న ముముక్షత్వానికి చిహ్నాలు. ముముక్షత్వం స్త్రీ పురుషులిద్దరిలోను ఉండును. మోక్షకాములైన స్త్రీలకు కూడ ఆధ్యాత్మిక మార్గం సులభంగా దొరకాలని ఆయన గట్టినమ్మకం. మానవ జీవిత లక్ష్యం ముక్తి. స్త్రీకి వివాహము, మాతృత్వము పరమావధులు కావు. వైవాహిక జీవితాన్ని నిరాకరించ దలచిన వారికి సమాజం తగు అవకాశాలు కల్పించాలని వివేకానందుల అభిప్రాయం. కనుక స్త్రీలకు కూడ సన్న్యాసాశ్రమం ప్రసాదించచాలని ఆయన సంకల్పించారు. In America he did so for 2 or 3 women హైందవ సమాజంలో గృహస్థాశ్రమం స్వీకరించకుండా స్త్రీలు సన్న్యాసం స్వీకరించే సందర్భం ఇదే ప్రథమం అయి ఉండవచ్చు.

బౌద్ధకాలంలో భిక్షిణులు ఉండేవారు. కాని, స్త్రీలు అభ్యర్థించగా, ఆనందుడు వారి తరఫున గట్టిగా వేడికొనగా, బుద్ధుడు కొంచెం అయిష్టతతోనే సమ్మతించాడని చెప్పతారు.

ఆధునిక కాలంలో, సన్న్యాసినుల మఠం స్థాపించాలని సంకల్పించిన వివేకానంద ముక్తిమార్గ ప్రయాణంలో స్త్రీ పురుష భేదాన్ని నిరాకరించారు. తాను చేసిన వాదాలకు అనుగుణంగా, స్త్రీల మఠం పురుషుల ఆధీనంలో కాక స్వతంత్రంగా వ్యవహరించాలనీ, సకల నిర్ణయాలు స్త్రీలే తీసికొనాలని ఆదేశించారు. వివేకానందుని జీవితకాలంలో భారతీయ మహిళల స్థితిగతులు ఆయన మనోభీష్టానికి అనుకూలంగా లేకపోయినా, ఆయన నిర్యాణం అయిన అర్ధ శతాబ్దానంతరం ఆ కల వాస్తవముయింది. భారతదేశంలో పలు శాఖలు కలిగి, కలకత్తాలో రామకృష్ణ శారదాదేవుల నివసించిన దక్షిణేశ్వర కాళికాలయానికి సమీపంలో శ్రీ శారదామఠం వెలిసింది.

## ముగింపు :

నరజన్మ లభించిన ప్రతి జీవి, జన్మ సార్థక్యం చెందడానికి ఆధ్యాత్మిక మార్గంలో పయనించి, మానవజీవిత లక్ష్యం అయిన ముక్తి ప్రాప్తికి యత్నించాలని వివేకానంద కాంక్షించారు. అందుకు కావలసిన మార్గదర్శనం ప్రపంచ మంతటికీ భారతదేశమే అందించగలదు. ఎందరో మహర్షులు ఆధ్యాత్మిక సత్యాలను, ఆత్మజ్ఞానాన్ని ఆస్తిగా వదలివెళ్ళిన పుణ్యభూమి ఇది. కాని వర్తమానంలో జనాభాలో అత్యధిక శాతం దీనిని విస్మరించి, దీనిని తెలిసికొనలేక నిద్రావస్థలో ఉన్నారు. ఈ దేశాన్ని జాగృతం చేయాలి. అందుకై విద్యావిహీనులై, పలు అణచివేతలకు గురిఅయి, వ్యక్తిత్వాన్ని కోల్పోయిన వర్గాలను చైతన్యవంతులను చేయాలి. ఆ వర్గాలలో ఒక ప్రధాన వర్గం మహిళలు. మహిళలకు సమాన విద్యావకాశాలు కావాలన్నారు వివేకానంద. ఆ విద్యలో ఆధునిక విజ్ఞాన శాస్త్రంతోబాటు భారతీయ సంస్కృతి, సాహిత్యం, లలితకళలు, హస్తకళలు సమ్మిళితమై ఉండాలి. విద్య మూలంగా శీలనిర్మాణం జరిగి, బుద్ధికుశలత పెరిగి, స్త్రీలు తమ కాళ్ళపై తాము నిలబడి, తమ సమస్యలకు పరిష్కారాలు వెదుకకొనగలగాలి.

విద్య మహిళలలో ఆత్మవిశ్వాసాన్ని, మనోస్థైర్యాన్ని పెంచి ఆమెలో అంతర్నిహితమై ఉన్న శక్తిని సద్వినియోగం చేసికొనే సామర్థ్యం అందించాలి. తనకు లభించిన స్వేచ్ఛను శరీర భోగాలకు, విలాసాలకు, సౌందర్య పోషణకు

మాత్రమే వాడుకొనరాదు. మహిళల విద్య కుటుంబం అభివృద్ధికి, సమాజాభ్యు దయానికి ఉపయోగపడాలి. ప్రాచీన సంస్కృతి, సనాతన ధర్మాన్ని పరిరక్షించ డానికి ఉపయోగపడాలి. అలనాటి సీత, వర్తమాన కాలంలో శారదాదేవి వంటి నారీమణులను ఆదర్శంగా భారతీయ మహిళ తన జీవితాన్ని తీర్చిదిద్దుకొని, ప్రపంచంలోని యావత్తు స్త్రీ జాతికి ఆదర్శంగా నిలవాలి. సీత, సావిత్రి, శారదా దేవి వంటి వారు ఒక జాతికి ఒక దేశానికి మాత్రం చెందినవారు కారు. వారి జీవితం, వారి ఆదర్శం విశ్వజనీనం. ఆ ఆదర్శాన్ని ప్రపంచానికి అందించవలసిన బాధ్యత భారతీయ మహిళది.

ప్రాచీన భారతీయ సమాజంలో మహిళకు ఉన్నత స్థానం ఉండింది. ఆ స్థానాన్ని నేటి స్త్రీలు తిరిగి పొందాలి. దైవాన్ని తండ్రిగానే కాక జగజ్జననిగా కూడా భావించిన భారతదేశంలో ప్రతి స్త్రీ శక్తిస్వరూపిణిగా, జగన్మాత అంశంగా మన్నింపబడాలి. ఈ సత్యాన్ని భావితరాలకు అందించే బాధ్యత మహిళలదే. అప్పుడే దేశం పురోగమించి, గతవైభవాన్ని పునరుద్ధరింపగలదు. అప్పుడే దేశంలో శాంతి సామరస్యాలు, సిరిసంపదలు వెల్లివిరుస్తాయి.

సమాజంలో స్త్రీ కూతురుగా, గృహిణిగా, తల్లిగా, విద్యార్థినిగా, ఉద్యోగినిగా, శ్రామికజీవిగా ఎన్నో పాత్రలు నిర్వహిస్తుంది. ఆదర్శకన్య, ఆదర్శ గృహిణి అని ఈ విధంగా ఆమె వేర్వేరు సందర్భాలలో ఎలా వ్యవహ రించాలో స్వామి వివేకానంద విడమరచి చెప్పలేదు. ఆదర్శ మహిళలకు ఆయన ఒక సమగ్ర రూపాన్ని చూపారు. దానిని ఆధారంగా చేసికొని, ప్రతి స్త్రీ తాను నిర్వహించే పాత్ర లేక పాత్రలను మలచుకొనవలసి ఉంటుంది.

# వివేకానందుడు : యువత

—డా॥ బొద్దుటూరి ఎల్లారెడ్డి

**ఉపక్రమం :**

స్వామి వివేకానందులు కారుచీకటి వ్యాపించిన ఈ దేశంలో కాంతిరేఖలా దూసుకొని వచ్చారు. నవభారత నిర్మాణంలో యువశక్తి ఆవశ్యకతను గుర్తించి, పారతంత్ర్య భారతంలో ఆత్మ స్వాతంత్ర్యం పేరిట పాంచజన్య శంఖారవాన్ని చేశారు. గుండెగుండెలో జాతీయ భావ జాగృతి నిమిత్తం వ్యవస్థీకృత క్రియాశీల నిర్మాణాత్మక అనుష్ఠాన వేదాంత శక్తిని ప్రగాఢంగా వెదజల్లారు. ఈ మానవుణ్ణి దివ్య మానవునిగా తీర్చిదిద్దడానికి చేయాల్సిన ప్రయత్నమంతా చేశారు.

తన పవిత్ర వాక్శక్తితో దేశవిదేశాల్లో పేరు తెచ్చుకొన్న మహానుభావు లెందరికో నిర్మాణాత్మక మార్గాన్ని చూపించారు. ఒక నేతాజీ, ఒక గాంధీజీ, ఒక విశ్వకవి, ఒక రోమారోలా వారి ప్రభావానికి గురయ్యారంటే వారిలోని నిర్మాణాత్మక ధీశక్తి ఎంత మహత్తరమైందో అధ్యయనం చేయాల్సిన అవసర మున్నది.

వివేకానందస్వామి నేడు జీవించివున్నట్లైతే నే నాయన పాద సన్నిధిలో ఉండేవాన్ని. నేను అతిశయమేమి చెప్పనట్లైతే, ఆధునిక భారతం ఆయన సృష్టి.

**నేతాజీ - సుభాష్ చంద్రబోస్**

భారత దేశాన్ని గూర్చి తెలుసుకోవాలంటే వివేకానందుని అధ్యయనం చేయండి. ఆయన విధానంలో అంతా నిర్మాణాత్మకమేగాని, వ్యతిరేక భావము లకు తావులేదు.

**విశ్వకవి - రవీంద్రనాథ్ ఠాకూర్**

వివేకానందస్వామి రచనలు నేను క్షుణ్ణంగా అధ్యయనం చేశాను. నా దేశమంటే నాకు గల ప్రేమ, ఆయన రచనలు మననం చేసుకున్న ఫలితంగా సహస్రాధికంగా వృద్ధి చెందింది.

**జాతిపిత - మహాత్మా గాంధి**

ఎక్కడి పాశ్చాత్య దేశాలు! ఎక్కడి సనాతన ధర్మం! సనాతన ధర్మ సందేశాన్ని పాశ్చాత్యులకు అనర్గళంగా చాటి చెప్పిన వివేకానంద యతి వరేణ్యునికి వినయంతో కృతజ్ఞతాంజలి సమర్పించకుండా ఉండలేము.

**మహా వక్త - సురేంద్రనాథ్ బెనర్జీ**

ఈనాడు వివేకానందుని సందేశము అక్షర రూపంలో చదువుతున్నంత మాత్రముననే నా ఒడలు జలదరిస్తుంది. విద్యుదాఘాతమువలె ఆయన వచనాలు నన్ను కుదిపివేస్తాయి. అట్లాంటి దివ్యవాణిని, ఆయన ముఖతః వినియున్న శ్రోతలు ఎంతటి అనుభూతి పొందియుండిరో!

—నోబెల్ బహుమతి గ్రహీత,
సుప్రసిద్ధ ఫ్రెంచి నవలా రచయిత
**రోమారోలా**

ఇందరిని ప్రభావితం చేసిన స్వామి వివేకానందుల అసామాన్య వ్యక్తిత్వం భారతీయ యువతను కూడా జాగృతం చేసింది. నేతాజీ, గాంధీజీ తదితరులు కూడా తమ యౌవనంలోనే వివేకానందుల నిర్మాణాత్మక సాహిత్య ప్రభావానికి వశమైపోయారు. మరి అలాంటి వివేకానందులు యువత కిచ్చిన సందేశసారాన్ని ప్రస్తావించుకొందాం.

## కారుచీకటిలో కాంతిరేఖ

భారతదేశం బానిస శృంఖలాలతో బందీయై విలపిస్తున్న తరుణంలో, భారతీయులంతా అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న సమయంలో, కుల, మతవైషమ్యాలతో దేశం యావత్తు కుతకుతలాడుతున్నప్పుడు, ఈర్ష్యాసూయా ద్వేషాలతో సమాజం సతమతమైపోతున్నప్పుడు, సోమరితనం రాజ్యమేలుతున్న తరుణంలో ఐకమత్యం చెడిపోయి ఆత్మ విస్మృతిలో పడిపోయిన జాతిని తట్టి మేల్కొల్పడానికి నవయుగ వైతాళికుడిగా వివేకానందులు ఆవిర్భవించారు. అనేక అసమానతలతో సమాజం విడిపోయి, పడిపోయి, చెడిపోయి, పూర్తిగా పాడైపోయినప్పుడు జాతిని పునర్నిర్మాణం చేయడానికి దైవాంశసంభూతులుగా వివేకానందులు ఉద్భవించారు.

వివేకానందులు భారతదేశాన్ని పూర్తిగా పర్యటించి సమాజంలోని లోపాలను సంపూర్ణంగా అవగాహన చేసుకొన్నారు. భారతదేశ దైన్యస్థితిని చూసి విచలితుడై సమాజాన్ని సంస్కరించడానికి సన్నద్ధులైనారు. భారతదేశాన్ని పరిపూర్ణంగా ప్రేమించారు. దేశంలోని ప్రతి కణం ఆయనకు దైవాంశంగానే స్ఫురించింది. సమస్యల వలయంలో చిక్కుకుని చుక్కానిలేని సముద్రంలోని నావ మాదిరి దిక్కుతోచని స్థితిలోనున్న హిందూ సమాజానికి మార్గదర్శకుడిగా, ప్రస్థానకర్తగా, ప్రయోక్తగా, ప్రవక్తగా నిలిచి, దేశ పునర్నిర్మాణమనే మహా యజ్ఞంలో తానొక సమిధగా అంకితం కావాలనుకున్న మహాయోగి శ్రీ వివేకానందులు.

యువతపైననే భారతదేశ భవిత ఆధారపడియున్నదనే సత్యాన్ని గ్రహించి అకర్మణ్యులైన యువకులను మేల్కొల్పడానికి శక్తిని యావత్తు వినియోగించిన జాతీయతామూర్తి వివేకానందులు. దేశభక్తి, త్యాగం, సేవ, మానవత్వం, ఆత్మవిశ్వాసం, స్వాభిమానం, కార్యదీక్ష, దైవవిశ్వాసం మొదలైన సద్గుణాలను యువతలో పెంపొందించడానికి నిర్విరామంగా వారు కృషి చేశారు. పదునైన తన సందేశంతో పరమ సోమరులైన హిందూదేశ యువతను ఆసేతు శీతనగ పర్యంతం గ్రామగ్రామాన మేల్కొల్పిన యువతామూర్తి వారు. స్వార్థం, స్వీయసౌఖ్యం, ఐహిక భోగభాగ్యాలు వీడి కర్తవ్య నిష్ఠతో, కార్యరంగంలో దూకగల్గిన కొదమసింహాల వంటి యువవీరులను తట్టిలేపిన తత్త్వవేత్త స్వామి వివేకానందులు.

## హిందుత్వం - భారతీయాత్మ :

హిందుత్వంలోనే భారతీయ ఆత్మ నిక్షిప్తమై యున్నదని గ్రహించి, హిందుత్వ మాధారంగానే రాష్ట్రీయ ఆత్మను, రాష్ట్రీయ ఐక్యతను సాధించగలమని విశ్వసించిన మేధావి. అందుకే హిందువునని ప్రకటించు, హిందువునని గర్వించు, హిందువుగా జీవించు, అవసరమైతే హిందుత్వ పరిరక్షణకోసం ప్రాణాలు సమర్పించుమని తీవ్రాతితీవ్ర సందేశాన్ని దేశానికందించి యువతను మేల్కొల్పిన దీశాలి ఆయన. భారతీయులలో ఎన్ని లోపాలున్నప్పటికీ

వారిలోని హిందూ రక్తాన్ని గుర్తించి వారిని జాగృతం చేయడమే యువకుల కర్తవ్యమని ప్రవచించారు. హిందుత్వం కేవలం భారతీయుల శ్రేయస్సుకు మాత్రమే పరిమితం కాదని విశ్వమానవ శ్రేయస్సు హిందుత్వంలో ఉన్నదని వివరించారు.

భారతీయులు సాటి ప్రపంచంలో పోటీపడలేక ఆత్మన్యూనతాభావంతో బాధపడుతున్నారు. మేము ఎందుకూ పనికిరామనీ, అసమర్థులమనీ, అవివేకులమనీ, లోకజ్ఞాన శూన్యులమనీ భావిస్తున్నారు. మేము స్వయంగా ఏ పని సాధించలేమనీ, ఎవరో ఒకరు వచ్చి మమ్మల్ని ఉద్ధరించందే మాకు భవిష్యత్తు లేదని ఆలోచిస్తూ ఆత్మాభిమానం, స్వాభిమానం కోల్పోయి బానిసలుగా పడియున్నారు. ఎవరు వచ్చి అధికారం చెలాయించినా తలలు వంచి అంగీకరించడానికే, ఊడిగాలు చేయడానికే, గంగిరెద్దుల్లా తల లూపడానికే అలవాటు పడ్డారు. ఎదురు తిరిగి ప్రశ్నించే శక్తి కోల్పోయారు. హక్కుల గురించి అడిగే దమ్ము లేకుండా పోయింది. చెప్పింది చేయడమే మినహా ఎందుకు? ఏమిటి? అని ప్రశ్నించే శక్తి కోల్పోయి అచేతనంగా పడియున్న తరుణంలో మేఘగర్జన వంటి మాటలతో భారతజాతి యావత్తును మేల్కొల్పిన వీర మేధావి వివేకానందులు. మీరు మేకపిల్లలు, గొర్రెపిల్లలు కారనీ, బానిసలుకారనీ, మీరు సింహాలనీ, వీరులనీ, భారతీయుల అస్తిత్వాన్ని తెలియజేసి మున్ముందుకు నడిపించిన వైతాళికులు వివేకానందులు.

భారతీయ తత్త్వశాస్త్రం చెప్పిన విషయాలు గాలికి వదిలేసి గాలివాటంగా బ్రతుకుతున్న హిందువులకు సరియైన దిశాదర్శనం చేయించిన మహామహిమోపేతులు వివేకానందులు. మన వేద పురాణ శాస్త్రాలు అస్పృశ్యతను పాటించమని చెప్పలేదు. కొందరు స్వార్థపరులు కల్పించిన అడ్డుగోడలవల్ల మన వైదిక ధర్మం దెబ్బతిన్నది. హిందూ సమాజం ఎంతగానో నష్టపోయింది. భారత పరిక్రమలో వివేకానందులు హిందూ దేశంలోని కొండకోనల్లో. మారుమూలల్లో పరిభ్రమించారు. హిందువుల మానసిక స్థితిని అవగతం చేసికొన్నారు. హిందూ ధర్మంలోని సమైక్యభావాన్ని అర్థం చేసుకోక తమలో తాము కలహించుకుంటూ హిందూ ధర్మానికి కీడు తలపెట్టడం ప్రత్యక్షంగా చూసి చలించిపోయారు. కుల, మత, వర్ణ, వర్గ వివక్షతో విడిపడిగా జీవిస్తూ శత్రుత్వం పెంచుకోవడం

గమనించారు. పాశ్చాత్య నాగరికత ప్రభావంవల్ల చాలామంది మేము హిందువుల మని చెప్పుకోవడానికి సిగ్గుపడే స్థితి గమనించారు. వ్యక్తిగత హోదాను చాటు కుంటూ, గర్వంగా భావిస్తూ పేదలను, అస్పృశ్యులను హీనంగా చూడడం గమ నించి కన్నీళ్ళపర్యంతమై విలపించారు వివేకానందులు.

ఎలాగైనా హిందూ రాష్ట్ర పునర్నిర్మాణం చెయ్యాలని తీవ్రంగా తపించి పోయారు. హిందుత్వ మాధారంగా మాత్రమే భారతదేశాన్ని పునర్నిర్మించగల మనీ హిందుత్వం వినా భారతదేశానికి భవిష్యత్తు లేదని ఖచ్చితంగా చెప్పగలిగిన మహానుభావులు వారు. హిందుత్వమే తన ప్రాణమని, హిందుత్వమే తన ఆత్మ యని, హిందుత్వమే తన సర్వస్వమని చాటి చెప్పారు.

"హిందువు అనే శబ్దం వినగానే నీలో విద్యుత్తుల్యమగు మహత్తర శక్తి కల్గాలి. ఏ దేశానికి చెందినవాడైనా, ఏ భాషకు చెందినవాడైనా హిందువు అనగానే నీకు ఆప్తుడు, ప్రేమ పాత్రుడు కావాలి. హిందువు అనేవాడు ఎవరు కష్టాలలో ఉన్నా నీ స్వంత కుమారుడే అలా వున్నట్లు వ్యధ చెందినపుడే నీవు నిజమైన హిందువువు. హిందువు అనే మాట వినగానే నీలో ఎక్కడ లేని శక్తి ఆవిర్భవించి, నిన్ను సర్వ సమర్థుణ్ణి చెయ్యాలి. అప్పుడే నీవు నిజమైన హిందువు అవుతావు" అన్నారు వారు.

## జీవసేవే - దేవసేవ :

చాల సంవత్సరాలు తపస్సు చేసిన మీదట వివేకానందులు పరమ సత్యాన్ని గ్రహించారు. ప్రతి మనిషిలో దేవుడున్నాడు. ఆ సత్యాన్ని గ్రహించ డమే మన కర్తవ్యం. ఎవడు జీవారాధకుడో అతడే శివారాధకుడు. జీవుడే దేవుడు. మానవసేవయే మాధవసేవ. జీవాత్మ పరమాత్మ అనుసంధానమే భారతీయ జీవిత పరమార్థమని వివరించారు. నరుడు నారాయణుడు కావాలి. జీవుడు దేవుడు కావాలి. పురుషుడు పురుషోత్తముడు కావాలి. పదార్థములు వదిలి పరమార్థమును దర్శించమని వివరించిన దార్శనికులు వివేకానందులు. మూర్ఖ దేవోభవ, దళితదేవోభవ, దరిద్రదేవోభవ అంటూ హీనులు, దీనులు, దళితులు, దరిద్రులు అందరు దైవాలే అని ఆ దైవాలను ఆరాధించడమే హిందు వుల కర్తవ్యమని వివరించారు. మన సమాజమంతా ఒక అవిభాజ్య కుటుంబమని

వేదోపనిషత్తులు ఘోషిస్తుంటే కొందరు కులమత వివక్షను రెచ్చగొట్టి, సమాజాన్ని విడగొట్టి అంతఃకలహాలను ప్రోత్సహిస్తున్న ఈ తరుణంలో వివేకానందుల సందేశమే శిరోధార్యమై యున్నది.

## వికారాలు విడనాడండి :

"నన్ను గాడిద అని పిలవండి కాని హిందువు అని పిలవద్దు" అని మన దేశంలోని కొందరు పెద్దల బుద్ధులు వికటిస్తున్నా ప్రపంచ ప్రసిద్ధులైన **మాక్సు ముల్లర్, డా॥ అనిబిసెంట్** మాత్రం మళ్ళీ జన్మంటూ వుంటే హిందూ దేశంలో పుట్టించమని. మనిషిగా కాకపోయినా ఇక్కడ కనీసం పశువుగానైనా పుట్టించమని వేడుకున్న మాటలలోని వైశిష్ట్యాన్ని గమనిస్తే హిందూతత్వ మెంత విశిష్టమైనదో, విశేషమైనదో అర్థమౌతుంది.

విదేశీయుల పాలన వల్ల, స్వార్థపరుల దోపిడి వల్ల, అజ్ఞానం వల్ల, అంధ విశ్వాసాల వల్ల, అంతఃకలహాల వల్ల దేశం పూర్తిగా పతనావస్థకు చేరుకున్నది. పతనమైన జాతిని సరియైన పథం వైపు నడిపించాలని వివేకానందులు విశేషించి కృషి చేశారు. నాటి సామాజిక సమస్యల పరిష్కారానికి తీవ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. దేశంలోని యువకుల ద్వారా మాత్రమే ఇది సాధ్యమని భావించారు. అందుకే ఆయన యువతను మేల్కొలిపినారు. గ్రామ గ్రామాన తన ప్రసంగాల ద్వారా యువతను ప్రేరేపించినారు. హిందూదేశ జన సామాన్యాన్ని ఉద్ధరించే పవిత్ర కర్తవ్యానికి అంకితం కాగల యువకులు కావాలి. నేను జన్మించింది ఈ యువత శక్తిని సంఘటిత పరచుటకు మాత్రమేనని వివరించారు. ఈ యువతపైననే దేశ భవిష్యత్తు ఆధారపడ్డదని భావించి ఆ యువశక్తిని మేల్కొల్పడానికి నిరంతరం కృషి చేశారు.

## యువకులు చైతన్యమూర్తులు కావాలి:

నిష్ఠాపరులు, నిస్వార్థులు, విశ్వసనీయులు, శక్తిమంతులు, బలవంతులు, గుణవంతులు, కర్మవీరులు, కార్యశూరులు అయిన యువకులు కావాలి. ధీరులు, శూరులు, త్యాగులు, సేవానిష్ఠగల యువకులు కావాలి. పిరికిపందలు, భోగలాలసులు, సోమరిపోతులు, అసమర్థులవల్ల ప్రయోజనం లేదు. పరహితార్థం కోసం

స్వీయసుఖాన్ని సైతం త్యజించగల్గే యువకులు కావాలి. అవసరమైతే ప్రపంచాన్ని సైతం ఎదిరించి పోరాడగల్గే ఆత్మవిశ్వాసం గల్గిన యువకులు కావాలి. దయార్ద్ర హృదయులు, పరోపకార పరాయణులు, మానవతా మూర్తులు, సౌశీల్య వంతులు, ఎట్టి విపత్కర పరిస్థితులెదురైనా ఎదిరించి నిలిచే స్వభావం కల్గిన యువకులు కావాలి.

ఉత్తిష్ఠత! జాగ్రత!! ప్రాప్యవరా న్నిబోధత!!! లెండి! లేచినిలబడండి!! మీ గమ్యము చేరువరకు విశ్రమించకండి!!! పోరాడండి, ఒక్క అడుగుకూడా వెనక్కు వేయవద్దు. ఆకాశమునుండి నక్షత్రాలు రాలినా, ప్రపంచమంతా ఏకమై నిలిచినా, ధైర్యంగా నిలబడే వీరులు కావాలి. పిరికిపందలుగా మారకండి, బానిసలుగా పడియుండకండి, భయపడితే బ్రతుకే శూన్యం.

ఓ నవయువకులారా! మెతకతనం చూపించడానికిది తరుణం కాదు. మనకు కావలసింది ఇనుపకండరాలు, ఉక్కునరాలు, వజ్రాయుధమువంటి సంకల్ప శక్తి కావాలి. మృత్యువుతో ముఖాముఖి పోరాడవలసి వచ్చినా జంకనటువంటి దృఢసంకల్పంగల యువకులు కావాలి. నిద్దుర పోవుటకిది సమయం కాదు. భావి భారత భాగ్యోదయం మీ పైననే ఆధారపడియున్నది. అభేద్యమైన దైహిక, మానసిక శక్తులు సాధించుటయే నేటి యువకుల కర్తవ్యమై యున్నది.

ఆపాదమస్తకము తొణికిసలాడే క్షాత్రతేజం గల్గిన సత్యాన్వేషణ కొరకు ప్రాణాలర్పించగల ధైర్యవంతులైన యువకులు కావాలి. త్యాగమే ధనుస్సుగా, విజ్ఞానమే కరవాలంగా ధరించిన వీరులైన యువకులు కావాలి,

జీవితాన్ని సుఖమయ ఉద్యానవాటిగా భావించే ప్రేమ కలాపి కాదు నేడు కావలసింది. జీవన సంగ్రామరంగంలో మహాయోధులై నిలువగల్గిన ధీర యువకులు కావాలి. అమోఘమైన పరిశ్రమ, అచంచలమైన సంకల్పం కల్గి, సముద్రాన్ని సైతం ఆపోశన పట్టే స్థయిర్యం, కొండలను పిండికొట్టగల ధైర్యం కలిగిన యువకులు కావాలి.

మన పూర్వులు ఎన్నో మహత్కార్యాలు సాధించారు. మనము వారికంటె ఘనకార్యములు సాధించవలసి యున్నది. ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు,

ఋజుప్రవర్తకులు, ఆత్మవిశ్వాసపరులైన యువకులు. అట్టి యువకులు ఒక వంద మంది లభిస్తే ఈ ప్రపంచాన్ని సంపూర్ణంగా పరివర్తనం చేయవచ్చునని వివేకానందులు విశ్వసించారు.

ఇచ్ఛాశక్తి శ్రేష్ఠతరమైనది. దానిముందు తక్కిన శక్తులన్నియు లొంగి పోవలసిందే. మనము చాలకాలము దుఃఖించియున్నాము. ఇకముందు దుఃఖించ నవసరములేదు. ఎదురుతిరిగి మన శక్తిని ప్రపంచానికి చాటిచెప్పే యువకులు నిర్మాణం కావాలి. వ్యర్థ ప్రసంగములతో మీ శక్తిని వృథా చేయకండి. ఖడ్గము చేతబూని ప్రపంచమంతా ఒక్కుమ్మడిగా దాడిచేసినను భీతిల్లక ఎదిరించి పోరాడాలి. మీ భార్యాబిడ్డలు మీకెదురై నిల్చినను, మీ ఐశ్వర్యములు సమస్తము నాశనమైపోయినను, మీ ధర్మమును అంటిపెట్టుకొని నిలవండి. అప్పుడే విజయం చేకూరుతుంది అని నిద్రాణ యువశక్తిలో చైతన్య పూత్కారం చేశారు స్వామి వివేకానందులు.

మీరు పాశ్చాత్యులను అనుకరించడం ద్వారా ప్రయోజనం లేదు. అనుకరణం వల్ల విదేశీభావాలు మన సొంతం కాజాలవు. పులితోలు కప్పుకున్నంత మాత్రాన గార్దభము సింహం కాజాలదు. ఓ యువకులారా! మహత్కార్యాలు సాధించవలసియున్నది. ఇతరులను సేవించడానికై సమస్తము సమర్పించగల యువకుల పైననే నా ఆశలు ఆకాంక్షలు ఆధారపడి యున్నవి.

## మాతృదేవత పూజారులు కావాలి :

శక్తిమంతులు, ఉత్సాహవంతులు ఐన యువకులు కావాలి. నీ వివాహము, ధనము, జీవనము నీ విషయ సుఖముల కొరకు, వ్యక్తిగతమైన ఆనందం కొరకు కాదు - నీవు మాతృదేవత వేదిపై సమర్పించడానికే అవతరించావని మరచి పోవద్దు. ఇతరులలోని మంచిని గ్రహించి, దానిని నీ పద్ధతిలో సొంతం చేసుకున్నప్పుడే ప్రయోజనముంటుంది. ఈ దేశంలోని నిరుపేదల కష్టంతో విద్యాబుద్ధులు గడించి వారి రక్తమాంసాలతో అభివృద్ధి సాధించి వారిని గురించి తలచనైను తలచని ప్రతి వ్యక్తి దేశద్రోహియే.

ఇతరులకోసం చేసిన ప్రతి చిన్న పని మీలోని ఆంతరిక శక్తిని జాగృతం చేస్తుంది. ఇతరుల ప్రయోజనం గురించి చేసిన ప్రతి చిన్న ఆలోచన మీగుండెలో బలాన్ని నింపుతుంది. ప్రతిఫలాపేక్ష లేకుండా త్రికరణ శుద్ధిగా పనిచేసే యువకులనే తల్లి పిలుస్తున్నది. మనదేశంలోని బాలురకు భేరీభాంకార ఢంకార శబ్దాలు వినిపించాలి. చిన్నప్పటి నుండి కోమల వాద్య సంగీతాన్ని విని అబలలుగా మారిపోయారు ఈ పిల్లలు అన్న స్వామీజీ ఈ యువత నెంతగా అధ్యయనం చేశారో అర్థం చేసుకోండి!

బలవంతులైన యువకులు కావాలి. బలమే జీవనము. బలహీనతయే మృత్యువు. బలమే శాశ్వతము, అమరత్వము; బలహీనతయే దోషము, మరణము. మన దుస్థితికి బలహీనతయే కారణము. ముక్కు మూసుకొని జపతపాలు చేయడంకంటే ఫుట్‌బాల్ ఆడటం మేలు. బలవంతులే భగవద్గీతను చదవడానికి అర్హులు. బలవంతులే గీతను బాగా అర్థం చేసుకోగల్గుతారు.

ఆత్మవిశ్వాసం కల్గిన యువకులు కావాలి. తనపై తనకు విశ్వాసం లేనివాడే నాస్తికుడు. విశ్వాసం వ్యక్తిలోని దివ్యత్వాన్ని ప్రకటిస్తుంది. ఆత్మవిశ్వాసం అనంత శక్తిమంతమైనది. ఆత్మ అనంతం, అజరామరం. ఆత్మవిశ్వాసమే మన విజయానికి మూలము. నీ ధర్మముపట్ల విశ్వాసము, నీ పూర్వులపట్ల విశ్వాసము, నీ దేవతల పట్ల విశ్వాసము ప్రకటింపుము ఆ విశ్వాసమే నీ విజయ హేతువౌతుంది.

ఇతరులలోని దోషములు గుర్తించకండి. దోషమే అజ్ఞానము. మీరు బలహీనులని తెల్పుట ద్వారా ప్రయోజనంలేదు. విమర్శ, విధ్వంసం ఎంతమాత్రం ప్రయోజనకారి కాదు. నేను చెప్పునది సంస్కరించు అని కాదు; పురోగమించమని చెబుతాను.

సహాయమను మాట నీ మనసు నుండి పెరికివెయ్. నీవు సహాయం చేయలేవు. అది దైవదూషణం. కుక్కకు నీవు ఒక కరుడు అన్నం పెట్టునపుడు ఆ కుక్కను భగవంతునిగా భావించి సేవించాలి. ఆ కుక్కలో భగవానుడున్నాడు.

ధనికులను నమ్మవద్దు. వారు జీవచ్ఛవములు. వారియందు నాకు నమ్మకములేదు. శాంతస్వభావులు, వినయోపేతులు, విశ్వాసపాత్రులు ఐన యువకులయందే నాకు ఆశ యున్నది. అట్టడుగున పడి కృంగి కుమిలిపోవు చున్న ముప్పదిమూడు కోట్ల ప్రజల నుద్ధరించుటకు మీరు మీ జీవితమును అంకిత మొనర్తుమని ప్రమాణము చేయండి!

క్రీస్తు మాదిరిగా నీవు ఆవేదన చెందితివా- నీవు ఒక క్రీస్తువవుతావు. బుద్ధునివలె పరితాపము చెందితివా- నీవొక బుద్ధుడవవుతావు. పరితాపము లేని నాడు బుద్ధి వైభవమెంతయున్నా భగవంతుని చేరుట సాధ్యంకాదు.

సజీవమగు దైవము నీ యందేయున్నాడు. దానిని తెలిసికొనలేక మీరు దైవముకోసమై చర్చిలు, గుడులు కట్టిస్తూ వెర్రిమొర్రి అభూత కల్పనలన్నింటిని విశ్వసిస్తున్నారు. మానవ శరీరములలోగల మానవాత్మయే మన మర్పించవలసిన ఏకైక దైవం.

భారత దేశము ఉద్ధరింపబడుట తథ్యము అయితే ఈ సముద్ధరణము కండబలముతో కాక ఆత్మశక్తితో సాధింపబడును. విధ్వంసపతాక చేబూనికాక ప్రేమపతాక చేబూని సాధింపవచ్చును.

## భారతీయ హృదయ వైశాల్యం :

ఈ ప్రపంచము మన మాతృభూమికి ఎంతయో ఋణపడి యున్నది. మన మెన్నడును ఖడ్గములు ఝళిపించి మన మత ధర్మములు ప్రచారము చేసి యుండలేదు. ప్రపంచానికి శాంతియుత జీవనాన్ని సామరస్యాన్ని ప్రబోధించి నాము. తక్కిన మతములు తమ ప్రచారము రణభేరుల ఘోషలతోను, యుద్ధ భట వ్యూహములతోను, రక్తపాతముతోను, చేసినవి. వారి మత ప్రచారములు కోట్ల కొలది ప్రజల ఆర్తనాదములచేతను, పసిబిడ్డల ఏడ్పులతోను, వితంతువుల కన్నీళ్ళతోను సాగిపోయినవి. భారత దేశము యుగయుగాలనుండి శాంతియుత జీవనమును కొనసాగించుచున్నది.

## ధర్మరక్షకులు కావాలి :

రోము నగరము పొడసూపక మునుపే, యూరపు జాతులు అడవులబడి తిరుగాడు చుండిన కాలముననే భారతదేశం ధర్మప్రచారం చేసింది. ఎన్నెన్నో దివ్యభావ పరంపరలు ఈ దేశమునుండే ప్రచారమై వెడలినవని. అందుకే శతాబ్దాలుగా, సహస్రాబ్దాలుగా సాగిస్తున్న సనాతన ధర్మాన్ని సంరక్షించి, సంఘటిత పరచి, పోషించి, భారత జాతిని ఒక ఆధ్యాత్మిక మహాశక్తి స్వరూపంగా తీర్చిదిద్దవలసియున్నది. అందుకు యువకులు కావాలి, వారే ఈ పని నెరవేర్చుటకు అర్హులు.

## అజ్ఞానం తొలగాలి :

వివేకానందులు భారతదేశాన్ని పర్యటిస్తూ గమనించిన సమస్యలకు కారణం అజ్ఞానం, అవివేకం, ఆత్మన్యూనతాభావం. వీటన్నింటికీ కారణం భారతీయులలో చదువులేకపోవడమని గమనించారు. పాశ్చాత్యులు గౌరవంగా జీవించడానికి, సంపదలతో తులతూగటానికి వారికున్న విజ్ఞానమేనని తలపోశారు. కాబట్టి భారతీయులకు చదువు నేర్పినట్లయితే వారు కోల్పోయిన పూర్వవైభవాన్ని మరల సంతరింపచేసుకుంటారని ఆశించారు. భారతీయులలోని బలహీనతలన్నీ చదువు నేర్చుకోవడం ద్వారా మటుమాయమౌతాయని ఆశించారు. అందుకే ఆయన చదువు, చదువు, చదువు అని ఆవేదన చెందినారు.

భారతీయులంతా విద్యావంతులైతే భారతం స్వర్గతుల్యమౌతుందని ఆశించారు. అందుకే ఆయన దీనులకు, హీనులకు, దళితులకు, అస్పృశ్యులకు విద్య నేర్పాలని ఆరాటపడ్డారు. బ్రాహ్మణ బాలునికి ఒక అధ్యాపకుడు అవసరమైతే, హరిజన, గిరిజన బాలురకు పదిమంది అధ్యాపకులు కావాలని వివరించారు. ఒకవేళ పేదవారు, అస్పృశ్యులనబడేవారు పాఠశాలకు రాకపోతే అధ్యాపకులే వారి చెంతకు వెళ్ళి పాఠాలు నేర్పాలి. చదువుకున్న ప్రతి భారత యువకుడు పేదలకు, దీనులకు చదువునేర్పే బాధ్యతను స్వయంగా స్వీకరించినపుడే దేశ ప్రగతి సాధ్యమౌతుందని వివేకానందులు తెలియజేశారు. పొలంలో పనిచేసే వారివద్దకు, కర్మాగారాల్లో పనిచేసే పేద బాలుర చెంతకు వెళ్ళి, విధిగా పాఠాలు చెప్పిన, వారిలో ఆత్మవిశ్వాసం పెరుగుతుందని వివరించారు. దీనజనాభ్యుదయం

లోనే భారతదేశాభ్యుదయం ముడిపడి ఉందని హెచ్చరించారు. దేశంలోని చదువుకున్న యువకులందరిలో ఈ సంస్కారాన్ని నిర్మించి, వారిని కార్య రంగంలోనికి పంపించారు. వివేకానందుని ప్రబోధం కారణంగా ప్రేరణ పొందిన యువకులెందరో ఆ కృషిలో నిమగ్నమయ్యారు.

అనాడు వివేకానందులు నిస్వార్థపరులు, పవిత్రులు అయిన వందమంది యువకులనిస్తే ప్రపంచ గతినే మార్చివేస్తానని చెప్పియున్నారు. కాని, నేడు లక్షలకొద్ది యువకులున్నారు. కాని, వీరిలో దేశభక్తి లేదు. జాతీయతా దృక్పథము లేదు. సామాజిక చింతన అసలే లేదు. ధార్మిక జీవనమంటేనే ఒళ్లుమంట. నిర్వీర్యులుగా, నిస్తేజంగా తయారైనారు. వ్యసనలోలురై, విలాసాలలో మునిగి పోయినారు. త్రాగుడు, జూదం, వ్యభిచారం, రేసులు, సినిమాలు మొదలైన వ్యసనాలలో కూరుకొనిపోయారు. సమాజసంరక్షణం వారికి బొత్తిగా తెలియదు. విదేశీ ఇజాల మోజులో మునిగిపోయారు. వ్యక్తిగత ప్రయోజనాలే తప్ప సామాజిక ప్రయోజనాల గురించి ఆలోచించే తీరిక వారికి దొరకలేదు. ప్రస్తుతం భారత దేశాన్ని అందరూ విమర్శించేవాళ్లే కనిపిస్తున్నారు. వారిని ధైర్యంగా ఎదిరించి వాదించే వ్యక్తులే కరువైపోయారు.

కాబట్టి నేటి యువకులకు వివేకానందుని సందేశం వినిపించాలి, వివరించాలి. వారిలో నిద్రాణంగా దాగివున్న జాతీయాత్మను మేల్కొల్పాలి. దేశాన్ని ఉద్ధరించేందుకు యువకులను ముందుకు నడిపించాలి. యావత్ప్రపంచం నేడు వివేకానందుని సందేశంకోసం అర్రులు చాస్తున్నది. అమెరికాలో వివేకానందుని ఉపన్యాస శతవార్షికోత్సవం ఘనంగా నిర్వహించారు. మన దేశ యువకులు వివేకానందుని స్ఫూర్తి గ్రహించి దేశాభ్యుదయానికి దోహదం చెయ్యాలి.

## భారతీయాదర్శాలు:

సేవ, త్యాగము భారతీయుల ఆదర్శాలు. త్యాగభావంతో ప్రపంచాన్ని సేవించడానికి ప్రయత్నించాలి. పనిని దైవంగా భావించాలి. విద్యుక్తధర్మాన్ని ఆరాధనగా భావించి కృషి చెయ్యాలి. నేడు మనకు కావలసింది ద్వేషము కాదు, ప్రేమ కావాలి. సంఘర్షణం కాదు, సమన్వయం కావాలి.

## దురాచారాలు దూరం కావాలి :

మన పతనమునకు మనమే కారకులము. అస్పృశ్యత సాంఘిక దురాచారము, మన ధర్మంలో ఈ అస్పృశ్యత లేదు. మన వేద, పురాణ శాస్త్రాలు అంగీకరించలేదు. కొందరు స్వార్థపరుల కారణంగా ఈ అస్పృశ్యత తలెత్తింది. ''ఆత్మవత్ సర్వభూతాని'' ''మమాత్మా సర్వభూతాత్మ'' ''జన్మనా జయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః'' అనే సూక్తులు అనంతకాలంనుండి వినబడుతూనే ఉన్నాయి. అస్పృశ్యత పాటించినంతకాలం భారతదేశానికి భవిష్యత్తు లేదని తెలియజేశారు వివేకానందులు.

మన పూర్వులలో కొందరు అస్పృశ్యులను కాళ్ళ్రదొక్కి నేలరాశారు. వారిని దిక్కులేని వారినిగా చేశారు. ధనవంతుల నిరాదరణంవల్ల, అస్పృశ్యులు దాదాపుగా తాము మానవులమను మాటయే మరిచిపోయారు. అనేక శతాబ్దాల కాలము గతిలేక కట్టెలు కొట్టుకొంటూ, నీళ్ల మోస్తూ, చెప్పులు కుట్టుతూ, కూలి నాలి చేసుకొని ఎట్లో జీవితాలు వెలిబుచ్చినారు.

ఈ పేదలను ఉద్ధరించి, వారిపై కారుణ్యమును చూపే యువకులు కావాలి. జంతువులలోసైతం దైవమున్నదని భావించిన హిందువులు అంటరానితనమనే పేరుతో మానవులపట్ల అమానుషంగా ప్రవర్తిస్తున్నారు. యువకులు అంటరానితనానికి వ్యతిరేకంగా ఉద్యమించాలి.

దీనజనులు, పీడితులు, ఆజన్మ దరిద్రులు తమ యథార్థ తత్వము తెలుసుకోవలసియున్నది. బలవంతులు, బలహీనులు, ఉత్తములు, నీచులు అందరిలోను అఖండాత్మయే ప్రకాశిస్తున్నది. యోగులు, మహర్షులు అగుటకు తగిన అఖండ శక్తి అందరియందును కలదు. కుల మత భేదములు విస్మరించి, విశ్వమానవ కోటి అంతయు ఒకటేయను భావం జాగృతం చేయడానికి నేడు యువకులు కావాలి.

## వ్యవస్థీకృత యువశక్తి నిర్మాణావశ్యకత :

యువకులను ఒక వ్యవస్థగా రూపొందించడానికే నేను జన్మించాను. యువకులను అనివార్య తరంగాలవలె భారతదేశమంతా పంపిస్తాను. వారి ద్వారా

ఉపశాంతిని, నైతికత్వమును, మతమును, విద్యను అధఃపతితులైన, దళితులయిన దీనుల ఇంటి వాకిటకు గొనిపోయి అందజేస్తాను. ఈ పని నెరవేర్చి తీరుతాను. లేదా ఆ ప్రయత్నంలోనే ప్రాణాలు విడుస్తాను. ఎచ్చటెచ్చట ప్రజలు ఆపదలపాలై విలపిస్తుంటారో అట్టి తావులకు యువకులు పోయి, వారిని ఆదుకోవాలి.

యువకులారా! సత్య మార్గమునుండి ఎన్నడును మరల వలదు. శాంతి యను రేవును చేరడానికి ముందుగా ఎన్నియో తుఫానులను,అలల అల్లకల్లోలములను దాటవలసియున్నది.

రాజకీయ స్వేచ్ఛ, సాంఘిక స్వేచ్ఛలు మంచివే కాని, వాస్తవమైనది ఆధ్యాత్మిక స్వేచ్ఛ. అది సాధించినపుడే ప్రగతి సాధ్యమౌతుంది. ఆధ్యాత్మిక స్వేచ్ఛను సాధించడమే యువకుల కర్తవ్యమైయున్నది.

ప్రతి వ్యక్తికి ఒక లక్ష్యముంటుంది. ప్రతి దేశానికి ఒక లక్ష్యముంటుంది. తాను వెల్వరించవలసిన సందేశముంటుంది. మన జాతీయ జీవనము ధర్మమునాశ్రయించియున్నది. ఓ నవయువకులారా! ఏనాడైతే మనము ధర్మము విడిచిపెడతామో. మనకు మృత్యువే శరణ్యమౌతుంది.

భౌతిక సుఖాలనే యిసుక పునాదులపై ఆధారపడిన జాతులన్నీ స్వల్పకాలముననే ఒక దాని వెంట ఒకటి నాశనమైపోయినవి. వేల యేండ్లుగా మన ధర్మము చెక్కు చెదరకుండా నిలిచియున్నది. ఆ ధర్మమును శాశ్వతముగా కాపాడుట యువకుల కర్తవ్యమైయున్నది. సోదరా! రోగముగానీ, చావుగానీ నీకు లేవు. ఏల విలపించెదవు? పరిణామముగానీ, మరణముగానీ నీకు నిర్దేశింపబడలేదు. శుద్ధ సత్త్వమే నీవు.

పవిత్రముగా ఉండుట, ఇతరులకు మంచి చేయుట - ఇదే పూజలన్నింటి సారాంశము. రోగులలో, బలహీనులలో దేవుని జూచువారు యదార్థముగా పరమశివుని భక్తులే. మరణమే తప్పనపుడు మంచి పనికై మరణింపుము. నీలోని పాశవిక ప్రవృత్తిని నిర్మూలించి నీవు మానవుడవు కావాలి. అంటే ప్రేమశీలివి, దానశీలివి కావాలి. బలహీనత కల్గించుదానిని దేనినైనను సరే - నీ కాలివేళ్ళతో

కూడా స్పృశింపవద్దు. మతాలు అనేవి అన్ని ఏకత్వరూపమైన మతమునకు వేర్వేరు ప్రకటనా విధానములే అని మానవ జాతికి తెలియచెప్పండి.

మీ ఇంటి ప్రక్క పేదప్రజలెందరో ఉన్నారు. కష్టాలమధ్య అల్లాడుతున్నారు శ్రద్ధతో, ఉత్సాహంతో వారిగగ్గరకుపోయి సేవించండి, రోగులైన వారికి మందులివ్వండి, శ్రద్ధగా పరిచర్యలు చేయండి. ఆకలితో అలమటించు వారికి అన్నం పెట్టండి. అజ్ఞానులైనవారికి మీకు తెలిసిన మేరకు చదువు నేర్పండి.

నిమ్న దళిత జాతులు, అజ్ఞానులు, దరిద్రులు, నిరక్షరాస్యులు చెప్పులు కుట్టెడువారు, వీధు ఊడ్చెడి వారు-వీరంతా నా రక్తమాంసాలే. ఓ యువకులారా! కదలిరండి. వారిని సేవించండి; తరించండి.

## నవభారత నిర్మాణావశ్యకత :

కర్షకుల గుడిసెలనుండి నాగలిచేతబూని నవ్యభారతము లేచి వచ్చును గాక! చేపలు పట్టెడి, చెప్పులు కుట్టెడి, వీథులు చిమ్మెడి సామాన్య జనుల గుడిసెల నుండి నవీన భారతము లేచివచ్చునుగాక! చిల్లరవస్తు దుకాణముల నుండి, సంతల నుండి, బజార్లనుండి, కర్మాగారముల నుండి నవ్యభారతము బయల్వెడలునుగాక! తోటలనుండి, అడవుల నుండి, కొండల నుండి, గుట్టల నుండి నవీన భారతము లేచివచ్చునుగాక!

ఈ దేశములో ఆకలితో నకనకలాడు ఒక కుక్క ఉన్నంత వరకును నాకు విశ్రాంతి లేదు. ఈ దేశములోని దీన, హీన, పరాన్న భుక్కులైన పేద ప్రజల నుద్ధరించుటకే నా జీవితం అంకితం చేస్తాను. ఆకలి ప్రేవుల హాహాకారాలు మాన్పుటయే నా ధ్యేయము, చదువురానివారికి చదువు నేర్పుటయే నా లక్ష్యం. రోగులకు మందులిప్పించడమే, వారికి ఆరోగ్యము కూర్చుటయే నా విధ్యుక్త ధర్మము. ఈ దేశ యువకులలో దేశభక్తినీ జాతీయ భావాలను పరిపోషించి నిర్మించి దేశహితానికి పనికివచ్చే వారినిగా తయారుచేస్తాను. ప్రపంచంలో భారతదేశాన్ని అగ్రస్థానంలో నిలబెడతాను. ఈ పనిలో నేను మోక్షమును కూడా కోరను. నా భారత సోదరుల కోసం వేయిజన్మలైనా భారతభూమిలోనే జన్మిస్తానని వివరించారు.

తే॥గీ॥ మరల మరల భరత మాతృగర్భంబున
జననమందువాడ జనని సాక్షి
మాతృఋణము తీర్చ మరవేయి జన్మలు
ప్రభవమందువాడ భారతమున.

ఉ॥ భారత జాతి నాది నవభారత వీరకిశోర మేను నా
భారతికన్నతల్లి నను పాలన జేసిన పాలవెల్లి నా
భరత స్వర్ణఖండమున పొందుక వేల సహస్ర జన్మముల్
కోరి జనింతు నిక్కముగ కోట్ల జనమ్ముల నుద్ధరింపగన్.

జైహింద్ - జైభారత్!